# ఆంధ్రపత్రిక

సచిత్ర వార పత్రిక





ANDHRA PATRIKA

ILLUSTRATED WEEKLY

4 అణాలు

6-2-57



కేశాలంకరణ

—చిత్రకారుడు : జి. శశిభూషణ్.

త్వరలో వస్తున్నది!

పొన్నలూరి బ్రదర్స్ వారి

# భాగ్యరేఖ

N.T. రామారావు, జమున
జానకి, రేలంగి, రమణారెడ్డి
సి.ఎస్.ఆర్, సూర్యకాంతం
నటించినది

డైరెక్టర్ : బి. యన్. రెడ్డి

వాహినీ విడుదల

BAKTHA

సంవత్సర చందా
రు. 12-0-0
విడిపత్రిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 51
సంచిక 23
**6-2-57**

దుర్ముఖ పుష్య బహుళ సప్తమి బుధవారం


##  విషయానుక్రమణిక 

ముఖచిత్రం : "భాగ్యరేఖ"లో జానకి.

# కాశ్మీర్ సమస్య

కాశ్మీర్ సమస్యపై జనవరి 24వ తేదీన భద్రతా మండలి ఆమోదించిన తీర్మానం దేశంలో చాలా సంచలనం కలిగించింది. శాంతిప్రియులను ఆందోళన పరిచింది. ప్రధాని నెహ్రూ దీన్ని "విపరీత తీర్మానం" అని విమర్శించారు.

భారతదేశం సందర్శించవచ్చిన సోవియెట్ రక్షణమంత్రి మార్షల్ ఝుకోవ్.

"సమితి ఆధ్వర్యాన కాశ్మీర్‌లో జనవాక్య నిర్ధారణ జరగాలి. అంతవరకు కాశ్మీర్ ప్రతిపత్తి విషయంలో ఎలాంటి మార్పు తీసుకురాకూడదు. ప్రస్తుతం ఉన్న ప్రతిపత్తికి భంగం కలగనీయకూడదు," అన్నదే భద్రతామండలి చేసిన తీర్మానం సారాంశం.

ఈతీర్మానాన్ని భద్రతామండలిలో అమెరికా, బ్రిటన్, ఆస్ట్రేలియా, కొలంబియా, క్యూబా దేశాలు ప్రతిపాదించాయి.

భద్రతా మండలిలో సభ్యులైన 9 దేశాల ప్రతినిధులు తీర్మానానికి అనుకూలంగా ఓటు చేశారు. ఒక్క రష్యా మాత్రమే ఓటుచేయకుండా తటస్థంగా ఉండిపోయింది.

ఈ ఓటింగు వ్యవహారం చాలా విచిత్రంగా జరిగింది.

పాకిస్థాన్ తరఫున ఫిరోజ్ ఖాన్ నూన్ తమవాదం పూర్తిగా భద్రతామండలి సభ్యులకు తెలియజేశారు. ప్రధాని నెహ్రూ లోగడ చేసిన నిర్యుద్ధప్రకటన ప్రసక్తినికూడా నూన్ ఈవాదనలో తెచ్చారు.

తరవాత భారత ప్రతినిధి వి. కె. కృష్ణమీనన్ సమగ్రంగా సుమారు ఎనిమిది గంటలసేపు కాశ్మీర్ వ్యవహారం పుట్టుపూర్వోత్తరాలన్నీ భద్రతామండలి సభ్యులకు తెలియజేశారు.

అయితే, కృష్ణమీనన్ వాదం పూర్తి కాకుండానే, కాశ్మీర్ తీర్మానం ముసాయిదా భద్రతామండలి సభ్యుల చేతుల్లోకి వచ్చివేసింది. తీర్మానం రచనలో బ్రిటన్ తెరవెనుక చాలా ప్రధానమైన పాత్ర నిర్వహించింది.

దీన్నిబట్టి అమెరికా ఇంగ్లండు దేశాలు, ఆ దేశాల అడుగుజాడల్లో నడిచే దేశాలు ఈ విషయంలో అప్పుడే ఒక నిర్ణయానికి వచ్చివేశాయనీ భారత ప్రతినిధి ఎంత గొప్పగా తమ వాదం వినిపించినా, అదంతా కేవలం అరణ్యరోదనమే అయిపోయిందని తేలింది.

ఆ మరునాడే—అంటే జనవరి 26వ తేదీ అర్ధరాత్రి-కాశ్మీర్ రాజ్యాంగ పరిషత్తు చేసిన సంపూర్ణ విలీన తీర్మానం అమలులోకి వచ్చింది. కాశ్మీర్ రాజ్యాంగ పరిషత్తు ఈ తీర్మానాన్ని ఇంతకు పూర్వమే ఆమోదించిందిగాని, 26 జనవరినగాని ఇది పూర్తిగా అమలులోకి రాలేదు. దీనితో భారతదేశ అంతర్భాగంగా కాశ్మీర్ సంబంధబాంధవ్యాలు బాగా స్థిరపడిపోయాయి.

దీనికి నిరసనగా పాకిస్తాన్‌లోని కొన్ని నగరాలలో ప్రదర్శనలు జరిగాయి. వాటిలో కొన్నిచోట్ల ప్రదర్శకులు ప్రధానినెహ్రూ ప్రతిమలను బహిరంగంగా తగలపెట్టి తమ అక్కసు వెళ్ళబోశారు.

మొట్టమొదట కాశ్మీర్ వివాదంపై భద్రతామండలికి ఫిర్యాదు చేసింది భారతదేశం.

కాశ్మీర్ చట్టరీత్యా భారతదేశంలో చేరిందనీ, అప్పైన పాకిస్తాన్ దానిపై పెద్దఎత్తున దురాక్రమణ జరిపిందనీ ఈ దురాక్రమణను అరికట్టవలసిందనీ తొమ్మిదేళ్ళ క్రితం భారతదేశం చేసిన ఫిర్యాదు సారాంశం. కాని భద్రతామండలి భారత ప్రభుత్వ వాదనను ఎప్పుడూ తిన్నగా వినిపించుకొన్న పాపాన పోలేదు. మొదటినించీ లోలోపల పాకిస్థాన్నే వెనక వేసుకురావడం మొదలుపెట్టింది.

కృష్ణమీనన్ మొన్న భద్రతామండలి ఎదుట చేసిన ప్రతిపాదనలలో నాలుగు ముఖ్య విషయాలున్నాయి. కాశ్మీర్ భారతదేశంలో చేరడం ఇంతకు పూర్వమే జరిగి

# ★ కాశ్మీర్ సమస్య ★

పోయింది. ఈ న్యాయం అప్రతిహతమైనది. దీన్ని ఇప్పుడు ఎవ్వరూ మార్చలేరు. ఇది మొదటి విషయం.

అమెరికా పాకిస్థాన్‌తో సైనిక సహాయ ఒప్పందం చేసుకున్న ప్రస్తుత పరిస్థితులలో జనవాక్య నిర్ధారణ జరపడం అసాధ్యం.

అసలు మొట్టమొదటగా పాకిస్తాన్ కాశ్మీర్‌పై దురాక్రమణ జరిపింది. కాబట్టి, భద్రతామండలి దీనిమీద చర్చ జరిపి, పాకిస్తాన్ సైన్యాలు ఆక్రమిత కాశ్మీర్ ప్రాంతం నించి వెళ్ళిపోయేట్టు చెయ్యాలి

అదీగాక, కాశ్మీర్ ఇటీవల అనేక రంగాలలో అపూర్వమైన అభివృద్ధి సాధించింది. ఇన్నాళ్ళనించీ పాకిస్తాన్ కాశ్మీర్‌లో జనవాక్య నిర్ధారణ జరపడానికి వీలుగా అవసరమైన చర్యలు ఏవీ తీసుకోలేదు కాబట్టి ప్రస్తుతపరిస్థితులలో జనవాక్య నిర్ధారణ సాధ్యంకాదు. ప్రస్తుతం కాశ్మీరులో పరిస్థితులు బాగాకుదటబడ్డాయి. ఈ పరిస్థితులను తారుమారుచేసే చర్యలేవి తీసుకొన్నా, పరిస్థితులింకా విషమించే ప్రమాదం వున్నది. అందుచేత ప్రస్తుత పరిస్థితిని కూలద్రోసే నిర్ణయాలేవీ తీసుకోరాదన్నారు మీనన్.

శ్రీ కృష్ణమీనన్ చేసిన ఈ ప్రతిపాదనలేవీ భద్రతామండలి సభ్యులకు చెవికెక్కనే లేదు.

పాకిస్తాన్ మున్ముందుగా కాశ్మీరుపై దురాక్రమణ జరిపినప్పుడు, ఈ దురాక్రమణను అరికట్టవలసిందని భారతదేశం భద్రతా మండలికి చేసిన ఫిర్యాదు సంగతి ఏమైనట్లు? తొమ్మిదేళ్ళక్రితమే చేసిన ఈ ఫిర్యాదును ఎత్తుకోకుండానే, కాశ్మీర్ యథాస్థితికి భంగం రాకూడదని ఇప్పుడు ఈ నిర్ణయంద్వారా మండలి ఆదేశించడంలో అర్థమేమిటి? ఈ తీర్మానంవల్ల ముందు ముందు భారత పాకిస్తాన సంబంధాలు విషమిస్తే, అందుకు బాధ్యతెవరిది?

కాశ్మీర్ చైనాకు, రష్యాకు, పాకిస్తానుకు భారతదేశానికి సరిహద్దులలో ఉన్న ప్రాంతం అందుచేత యుద్ధవ్యూహందృష్ట్యా ఇది చాలా కీలక ప్రాంతం. ఇన్నాళ్లనించి బ్రిటన్ పైపైకి తటస్థదృష్టి ప్రదర్శించినా,లోలోపల పాకిస్తాన్‌కు పక్కతాళం వేస్తూనే ఉన్నది. ఆ తరవాత అమెరికా, పాకిస్తాన్‌ల మధ్య సైనిక ఒప్పందం జరిగింది. ఈ ఒప్పందంతో అమెరికా దృక్పథం బాగా మారిపోయింది. అందుచేత అమెరికాగాని, బ్రిటన్‌గాని ఈవ్యవహారంలో నిష్పక్షపాతదృష్టి అవలంబించ గలవని అనుకోవడం కేవలం భ్రమమాత్రమే.

మొన్న భద్రతామండలి ఆమోదించిన తీర్మానంతో అమెరికా బ్రిటనుల ఆంతర్యం బాగా బయటపడిపోయింది.

ఈ పరిస్థితులలో భారతప్రభుత్వం అనుసరించదగిన భవిష్యత్ కార్యక్రమమేమిటి? రేపో, మాపో జరగనున్న కేంద్ర మంత్రివర్గ సమావేశంలో కాశ్మీర్ సమస్య చర్చకువచ్చి తీరుతుంది.

వారాంతంలోగా భద్రతా మండలి తిరిగి సమావేశం కాబోతున్నది. ఈ సమావేశంలో కాశ్మీర్ సమస్యపై అమెరికా బ్రిటన్‌దేశాల అసలు ఆంతర్యాలు మరీ బాగా స్పష్టపడవచ్చు. సమితి మధ్యవర్తిగా తిరిగి మేజర్ గ్రాహాంరంగంలో ప్రత్యక్షం కావచ్చు.

ఏది ఏమైనా, కాశ్మీర్ విషయంలో భారతదేశం దృఢమైన ఒక వినూతన దృక్పథంలో వ్యవహరించవలసిన తరుణం ఆసన్నమైనది. ★

# మద్రాసు విశ్వవిద్యాలయం

## శతవార్షికోత్సవాలు

ఇటీవల మదరాసు విశ్వవిద్యాలయం శత వార్షికోత్సవం జేగీయమానంగా జరిగింది. మైసూరుగవర్నరు, శ్రీ జయచామరాజ వడయర్, ఈ ఉత్సవాలకు ప్రారంభోత్సవం జరిపారు.

ఉపరాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్ మొదలైన పలువురు ప్రముఖులీ ఉత్సవాలలో ప్రసంగించారు. దక్షిణ భారతంలో ఉన్నత విద్యావ్యాప్తికి మదరాసు విశ్వవిద్యాలయం చేసినసేవ చిరస్మరణీయమైనది.

18 వ శతాబ్దంలో క్రైస్తవ మతప్రచారకులు దక్షిణభారతంలో ఆంగ్ల విద్యావ్యాప్తికెక్కువగా కృషిచేశారు.

### మూడు విశ్వవిద్యాలయాలు

లార్డ్ ఎలిఫిన్‌స్టన్ (1840-57) 1841 లో ఒక హైస్కూలు స్థాపించారు. 1853 లో ఇది కళాశాలగా మార్చారు. దానికే ప్రెసిడెన్సీ కాలేజీ అని పేరుపెట్టారు. సరిగా ఆ సంవత్సరమే మద్రాసు విద్యాలయం ప్రారంభమైంది. ఆ సంవత్సరమే బొంబాయిలోను, కలకత్తాలోను మరి రెండు విశ్వవిద్యాలయాలకు శంకుస్థాపన జరిగింది.

ఈ మూడు విశ్వవిద్యాలయాలు ఆకాలంలో లండన్ విశ్వవిద్యాలయం ఒరవడిలో ఏర్పాటుచేశారు. మద్రాసు విశ్వవిద్యాలయంకూడా చాలాకాలందాకా ఆ ఒరవడిలోనే నడిచింది.

### పరీక్షలు

తరవాత క్రమంగా మదరాసు విశ్వవిద్యాలయం మెట్రిక్యులేషను, బి. ఎ., బి. ఎల్. మొదలైనపరీక్షలుజరపడం ప్రారంభించింది. క్రమంగా వైద్యము, ఇంజనీరింగు, మొదలైన శాఖలుకూడా ప్రారంభమయ్యాయి.

### అనుబంధ కళాశాలలు

1871 వ సంవత్సరం నాటికి అనుబంధ కళాశాలల సంఖ్య కొంచెం పెరిగింది. 4 ప్రభుత్వ కళాశాలలేగాక మరి ఏడు కళాశాలలుకూడా స్థాపించారు. పాశ్చాత్య ప్రణాళిక విషయంలో లండన్ విశ్వవిద్యాలయం అడుగుజాడలలో నడిచినా మన దేశ పరిస్థితులనుబట్టి కొన్నికొన్ని మార్పులుచేశారు.

### విశ్వవిద్యాలయ ప్రతిష్ఠ

ఆనాడు మద్రాసు విశ్వవిద్యాలయ పరీక్షలంటే గొప్ప ప్రఖ్యాతి ఉండేది. ఈ నాటికి కూడా ఈ విశ్వవిద్యాలయ పరీక్షల ప్రామాణ్యం దేశంలో అంతటా గౌరవిస్తున్నారు.

### పరిశోధన సంస్థలు

1904 నాటికి విశ్వవిద్యాలయంలో ఆయాశాఖలలో పరిశోధనసంస్థ లేర్పాటు చేశారు. ఇంతేకాక అనుబంధ కళాశాలల తనిఖీ మొదలైన విషయాలలో కొన్ని గట్టి నిబంధనలువిధించారు. విద్యార్థి వసతిగృహాల నిర్మాణాలలో విశ్వవిద్యాలయం బాగాశ్రద్ధ వహించింది.

1913 లో భారతప్రభుత్వం విశ్వవిద్యాలయాల స్థాపనలో కొన్ని ముఖ్యసూత్రాలు విధించింది. వీటివల్ల విశ్వవిద్యాలయాలపరిపాలనపరిధి కొంత పరిమితమైంది. ఇంకా మరి కొన్ని విశ్వవిద్యాలయాల స్థాపనకూడా జరిగింది. 1917 లో మైసూరులో ఇంకొకవిశ్వవిద్యాలయం స్థాపించారు. 1918 లో హైదరాబాదు విశ్వవిద్యాలయస్థాపన జరిగింది. ఇవన్నీ మద్రాసు విశ్వవిద్యాలయం ఒరవడిలోనే స్థాపించారు.

భారతప్రభుత్వం 1917 లో నియమించిన శాడ్లర్ కమిటీ దేశంలో విశ్వవిద్యాలయాల అభివృద్ధికి కొన్ని ముఖ్యమైన సూచనలు చేసింది. విశ్వవిద్యాలయాలకు బాగా స్వాతంత్ర్యం ఉండవలెనని సూచించిన దీకమిటీయే.

విశ్వవిద్యాలయ నిర్వహణ కుపాధ్యక్షుల నియామకం జరగాలనికూడా ఈ కమిటీ సూచించింది. ఈ సూచనల ప్రకారం 1923 లో కొత్త విశ్వవిద్యాలయ చట్టం అమలులోకి వచ్చింది.

ఆ సమయంలోనే మద్రాసురాష్ట్రంలో 'ద్వంద్వ' ప్రభుత్వం అమలులోకి వచ్చింది. విద్య ప్రజాప్రతినిధులైన మంత్రుల పరిపాలనలో చేరింది. నిజానికి 1923 వ సంవత్సరం మద్రాసు విశ్వవిద్యాలయ విస్తరణలో ఒక ప్రధానఘట్టమని అనవచ్చును. అప్పుడప్పుడు కొన్ని చిన్నచిన్న మార్పులు చేసినా ఆసంవత్సరం అమలులోకి వచ్చిన విశ్వవిద్యాలయ చట్టమే నేటికీ మద్రాసు విశ్వవిద్యాలయానికి పునాదిగా నిలిచింది.

### పరిశోధన అభివృద్ధి

ఇటీవలికాలంలో మద్రాసు విశ్వవిద్యాలయంలో పరిశోధన బాగా అభివృద్ధిచెందింది. జంతుశాస్త్రము, బయోకెమిస్ట్రీ, వృక్షశాస్త్రము, భారతీయ సంగీతము, మనశ్శాస్త్రము మొదలైన విషయాలలో పరిశోధనశాఖ లేర్పాటు చేశారు. ఇంకా ఫ్రెంచి, జర్మనీభాషలలోను, పత్రికారచనలోను, డిప్లొమాపరీక్ష లేర్పాటుచేశారు.

### ప్రచురణలు

విశ్వవిద్యాలయం కొన్ని అమూల్యమైన గ్రంధాలుకూడా ప్రచురించింది. మరికొన్ని ప్రచురిస్తున్నది. వీటిలో ప్రధానమైనది. సంస్కృతగ్రంథసూచిక. ఈ సూచికలో ప్రపంచంలో ఉన్న అమూల్యమైన సంస్కృత తాళపత్ర గ్రంథాల పేరులన్నీ సేకరించి ప్రచురిస్తున్నారు. ఇదిగాక తమిళ నిఘంటువుకూడా ఒకటి ప్రచురిస్తున్నారు. ఇది వాఙ్మయపరిశోధన కెంతైనా ఉపకరించగలదని విద్వాంసులాశిస్తున్నారు. మెకంజీ గ్రంథసంపుటాల ప్రచురణకూడా ప్రారంభమైనది. ఇంకా ఆయా పరిశోధనశాఖలలో వ్యవసాయాది శాస్త్రాలలోను, వ్యవసాయపద్ధతులలోను పరిశోధనలు సాగిస్తున్నారు.

ఇటీవల ఇంకా కొన్ని కొత్త విశ్వవిద్యాలయాలు బయలుదేరాయి. 1926 లో ఆంధ్ర

(56-వ పేజీ చూడండి)



# బుడుగు! చిచ్చులపిడుగు

అయితే నేను ఇపుడు ఎక్కిన ఆడ మెడ్రాసు రైలులో చిన్నపిల్లలు అస్సలు ఉంగా అనుకో.

ఒక్క నసీ. గానపెసూనాంబ ఒకటే ఉంది. నసీ. గానపెసూనాంబ అంటే ఆడది.

ఆడది అంటే, అసలు అమ్మ అని అర్థం. ఇలా అని నాన్న చెప్పాడు.

ఆడది అంటే పెళ్లాం అనికూడా అర్దంట. ఇది బాబాయి అభిప్రాయం. బాబాయి దగ్గిర ఇవి చాలా ఉన్నాయి అని చెప్పానుగా. వాడిని ఇంకా అడిగితే ఆడది అంటే ఒక్కోసారి సుబ్బలష్మి అని, ఒక్కోసారి సీత అనీ చెప్తాడు అనుకో.

అదన్నమాట. ఇప్పుడు పెళ్లాం అంటే, దానికి ఫదేళ్లుకన్న చాలా ఎక్కువ ఏళ్లు ఉంటాయి. ఇందాకా ఆడమెడ్రాసు రైల్లో నా దగ్గిర కిటికీలో కూర్చో లేదూ అది అనుకుందూ.

దాని పేరు నసి. అది నాకన్న



కాఫీ ఏదేనా కావాలా నసీ!

చాలా ఎత్తులే. అందికని భాలా గర్వం.

గర్వం అంటే అది మనతో మాట్టాడదన్నమాట. మనం కాఫీ కావాలా నసీ అంటే వద్దులే బుడుగూ అంటుంది.

మళ్లీ రైలాగాకా, వాళ్ల ముగుడు వస్తాడుగదా. వచ్చి కాపీ కావాలా నసీ అంటాడుగదా.

అప్పుడు నసి ఇలా నవ్వుతుంది. నవ్వి వద్దండీ అంటుంది. అయినా వాడు కాపీ తెచేస్తాడు.

రైలు మళ్లీ ఆగితే, ముగుడు మళ్లీ వస్తాడు. మళ్లీ కాఫీ కావాలా అని అడుగుతాడు.

అప్పుడు నసి మళ్లీ నవ్వుతుంది అది నవ్వితే బాగానే ఉంటుందనుకో. యలాగేనా అమ్మంత బావుండదు.

అపుడు ఆ ముగుడు మళ్లీ నవ్వుతాడు.

మీారు కూచున పెట్టిలో చోటు లేదా అంటుంది మళ్లీ నసి. అప్పుడ







వాడు లేదు ససీ, ఇక్కడే వుండూ, జగర్తా సుమా అని పరిగేతు కెళ్ళి పోతాడు.

వాడే కాదు. నేను కూచున్న ఆడమెడ్రాసు రైలు పెట్టి దగ్గిరికి బోల్డుమంది బాబాయిలు వస్తారు గదా. అప్పుడు నేను ఈల వేస్తాను గదూ అందుకూ.

బోల్డు బోల్డు బాబాయిలు వచ్చేసి నవ్వుతూ ఉంటారా.

రైలు కూ అని కూసి ఇలా కదల గానే పరిగేతుకెళ్ళిపోతారు.

మళ్ళీ రైలు ఇలా ఆగగానే పరి గేతుకొచేస్తారు.

వాళ్ళని చూస్తే ససికి బయం. ఇలా ఇటువేపు తిరిగి కూచుంటుంది.

మళ్లీ వాళ ముగుడు వచ్చాకా, నీతో వచేస్తాను అంటుంది.

వాడు జాగర్త అని చెప్పి వెళి పోతాడు.

అప్పుడు నాకు జాలివేసింది.

సస్సిని కొంచెం రక్షించాలి అను కున్నాను. అందుకని మళ్లీ ముగుడు రాగానే వురేయ్ వురేయ్ ముగుడూ అలా అస్తమానూ రాకూ, దీన్ని నేను రక్షిస్తానులే అని చెప్పాను.

కాని అది నామాట వినలేదుగా మరి. నేను కాఫీ కావాలా అంటే




ఒద్దు బుడుగూ అంది. నిన్ను రక్షిస్తానులే అంటే ఒద్దులే బుడుగూ అంది.

నేనంటే బయం అన్నమాట. అందుకే రైలు దిగి వెళ్ళిపోయింది.

నాకు బలే కోపం వచ్చిందిలే. నేనేం చిన్నవాడినా. లేకపోతే చితక వాడినా అలా ఖాతరు చెయ్యను అనడం.

ఖాతరు చెయ్యను అనడం అంటే సస్సి, వాళ్ల ముగుడితో రైలు దిగి వెళిపోడం అన్నమాట.

నా క్కోపం వచ్చిందిగా. అందుకని కోప్పడేశాను.

అప్పుడు అమ్మ ఎందుకురా బుడుగూ కోపం అంది.

మరి అది దానిముగుడితో ఎందుకు వెళి పోవాలీ అన్నాను నేను.

దానిముగుడితో అది వెళ్ళకపోతే ను వ్వెళ్తావుట్రా పోకిరి వెధవకానా అనేసింది అమ్మ పక్కనికూచున్న బామ్మగారు.

మరి నేను రక్షించుతాను అన్నానుగా అన్నాను నేను.

వాడి పెళ్లాన్ని వాడు రక్షించుకోగలడు లేవోయి బోడివెధవా, అంది ముసుకు వేసుకున్న ఆ బామ్మగారు.

మరి నాకు పెళ్లాం లేదుగా అని చెప్పాను నేను.

అప్పుడు మరెలాగ.

అందుకని ఎదురుగుండా కూచున్న లావు పాటి పిన్నిగారేమో, మా గాన పెనూనాంబని పెళ్లాడుతావురా అంది.

పెళ్లాడుతావురా అంటే నాకు తెలీదు. కాని, మరి నేను చిన్నవాడినీ చితకవాడినీ కానుగా అందుకని నాకు అన్నీ తెలుసుగా.

అందుకని సరే మీ గానపెనూనాంబని నేను పెళ్లాతాడువురాలెండి అని చెప్పేశాను.

అప్పుడేమో ఆ గాన పెనూనాంబ నవ్వేసి ఛీ అంది. అది చిన్నపిల్ల అనుకో అయినా ఓ ఫదేళ్ళు ఉంటాయి.

గానపెనూనాంబా నీపేరేమిటి అని అడి







# ★ బుడుగు! చిచ్చుల పిడుగు! ★




గాను. నాపేరు సీగానపెసూనాంబ అని చెప్పింది.

అప్పుడేమో నీపేరు బుకు రుకు గుకు కాకాదుకూ అంది.

అలాఅంటే ఏమిటో నాకు తెలీదు. ఇది తెలుగుకాదుగా. అందుకని నాకు తెలీదు అనేశా.

అపుడు ఓసారి ఉంగా ఆ. వ్రూ ఉంగా గావ్రూ అనేశా.

అలాఅంటే ఏమిటి అంది సీగాన పెసూనాంబ.

మరి బుకు రుకు గుకు కాకాదూకూ అంటే ఏమిటో చెప్పు అన్నాను నేను.

అప్పుడు అందరూ నవ్వేశారు ఎందుకనో.

తెలీదా అని నవ్వేసింది సీగానపెసూనాంబ. అలా నవ్వితే బలే ఉంటుందిలే.

తెలీదు అని చెప్పాను.

నీపేరూ బుకు రుకు గుకులే అంది మళ్ళీ.

అప్పుడు అమ్మ నా చెవిలో అపుసు అని చెప్పరా బుడుగూ అంది.

నేను ఓహో అనుకుని, అపుసు అని చెప్పరా బుడుగు అనేశాను ఘట్టిగా.

అప్పుడు అందరూ కలిసి సీగానపెసూనాంబని చూసి హె హె హె అనీ, యె - హే హే అనీ నవ్వేశారు. సీగాన పెసూనాంబ కూడా నవ్వేసింది.

చిన్నపిల్ల గదూ. ఏం తెలీదుగా అందుకని.

బుకురుకుగుకు అంటే బురుగూ అని అర్థం, ఇది కాబాషలే అని అపుడు చెప్పింది.

అప్పుడు నేను ఓహో అనుకున్నాను.

మరి ఉంగా ఉంగా ఆ వ్రూ గా ఉం అంటే ఏమిటి బుకురుకుగుకూ అని అడిగింది.

ఉంగా ఉంగా ఆ వ్రూ గా ఉం అంటే మరీ, నీవు చెప్పింది నాకు తెలియలేదు సీగానపెసూనాంబా అని అర్థమూ, ఇది ఉంగాభాషా ఇంకా నాకు చాలా భాషలు వచ్చును తెలిసిందా సీగానపెసూనాంబా అని చెప్పాను.

అప్పుడు సీగానపెసూనాంబేమో నాకు నేర్పించవా బుకురుకుగుకూ అంది.

మెడ్రాసు వచ్చేదాకా, సీగానపెసూనాంబకి నేను అవన్నీ నేర్పించాను. నాకు తెలుగు బాష కొంచెం వచ్చు. బుడుగుబాష బోల్డుబోల్డు వచ్చు. ఇలా అని బాబాయి అన్నాడులే.

ఇంకా నాకేమో ఉంగా బాషా, పిచిక బాష, చికబాష, కబాష, బా ష షు అవన్నీ తెలుసును.

పూర్వకాలం, అంటే నా చిన్నపుడు నేర్చుకున్నానులే. మొన్నకూడా ఉంగా బాష కధ ఒకటి నేర్చుకున్నాను. తకరక వాకాతక చెకప్తాకానుకులే.

ఇంకా వుంది స్మీ ★



# న్యూఢిల్లీ లేఖ

## కాంగ్రెసు టికెట్ల పంపిణీ

దేశవ్యాప్తంగా జరుగనున్న ఎన్నికలకు కాంగ్రెసుఅభ్యర్థులను నిర్ణయించడం పూర్తయింది. నిర్ణయించబడినవారు, బడని వారూ తమతమ నెలవులకు తిరిగి చేరుకున్నారు. ఇది మామూలుగా అయిదేళ్ళకొకసారి జరిగే తంతే.

కేంద్రమంత్రులు లోక్‌సభలోనే సభ్యులుగా ఉండాలనే వాదం ఒకటున్నది. ఈ వాదం ఫలితంగా పండిత జి. బి. పంత్, రాజకుమారి అమృతకౌర్, మెహర్‌చంద్ ఖన్నా, సి. సి. బిశ్వాస్, ఎస్. కె. డేగార్లను మినహాయించి మిగతా మంత్రులందరికీ లోక్‌సభ టికెట్లే ఇచ్చారు. రాజ్యసభ కేవలం పునర్విమర్శచేసే సంస్థమాత్రమే. కాని ప్రభుత్వ వ్యయాన్ని పరిశీలించే రెండు స్థాయీ సంఘాలలో (అంచనాలసంఘాలు) రాజ్యసభ సభ్యులకు కూడా సభ్యత్వం ఉన్నది. రాజ్యాంగరీత్యా ఇది విరుద్ధమైనదని కొందరు విమర్శించినా, అది అలాగే జరిగిపోతోంది.

దాదాపు ప్రజాస్వామిక దేశాలన్నిటిలోనూ, ప్రభుత్వంలోని వృద్ధ రాజకీయవేత్తలకు ఎగువసభ సభ్యత్వం కేటాయించడం పరిపాటి. వీరు ప్రభుత్వానికి అనుభవపూర్వకమైన సలహా లిస్తూ ఉంటారు. అందుచేత ఎగువసభను కొత్తమంత్రులకు వదిలిపెట్టడం మంచిపని కాదు.



ఇక మౌలానా సాహెబ్ సంగతి. ఈయన భారత రాజకీయ జీవితంలోకి, కేంద్ర శాసన సభలోకి పశ్చిమ బెంగాల్ నుంచి ప్రవేశించారు. క్రితంసారి ఈయన రాంపూర్ నుంచి ఎన్నిక అయ్యారు. ఈసారి గుర్‌గాం (పంజాబు)నుంచి పోటీచేస్తున్నారు. అసలు ఈయన వృద్ధుల్లోజమ గనుక ఎగువసభకు వెళ్ళవలసింది. అదీగాక ఆయన నియోజక వర్గాన్ని ఎందుకు మార్చారో తెలియడం లేదు. ప్రతి ముస్లిమూ, ముఖ్యంగా ఆజాద్ మనదేశపు మతాతీత తత్త్వానికి ఉదాహరణ

**శ్రీ కృష్ణ**
[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

ప్రాయులు. కీ॥ శే॥ రఫీ అహ్మద్ కిద్వాయ్ విషయంలో ఇలాగే జరిగింది. సర్దార్ జోగింద్ర సింగ్ (బహరైచ్) తమ నియోజకవర్గాన్ని కిద్వాయ్‌కిచ్చి ఆయన ఎన్నికలో గెలిచేట్లు చేశారు. అలాగే ఆజాద్‌ను దక్షిణాదినుంచి పోటీచేయమని నిర్దేశిస్తే, శ్రీ టి. టి. కృష్ణమాచారి ఆయన కొక నియోజక వర్గాన్ని తప్పక గెలిపించేదాన్ని చూసిపెట్టి ఉండేవారని నాకు తెలిసింది. అసలు ఆజాద్‌ను ఢిల్లీ ప్రజలే సగర్వంగా లోక్‌సభకు ఎన్నుకుని ఉండేవారు.

పంజాబులో అకాలీలు కాంగ్రెసును ఇబ్బందుల్లో పెట్టాలని చూస్తున్నారు. వారి వాదంలో కొంత సబబు లేకపోలేదు. అసలు శ్రీ పంత్ ద్వారా కాంగ్రెసు అకాలీలతో ఒడంబడిక చేసుకున్నది. ఈ ఒడంబడిక ఫలితంగానే హిమాచల్ ప్రదేశ్‌ను కేంద్రపాలిత ప్రాంతంగా ఉంచారు. ఈ ఒడంబడికలో ఒ-అంతరార్థం ఏమిటంటే, జాతీయ సిక్కులు సిక్కుజాతికి ప్రాతినిధ్యం వహించరని. ప్రాతినిధ్యం వహిస్తే అకాలీలతో వేరె ఒడంబడిక చేసుకోవలసిన అగత్యం ఎందుకు వచ్చింది? ఇప్పుడు కాంగ్రెసు టికెట్లను పంచడంలో, అకాలీలకంటె అకాలీలు కాని సిక్కులే ఎక్కువ టికెట్లు సంపాదించారు. ఇది అకాలీలకు అసంతృప్తి కలిగించింది. ఇలా చేయడంద్వారా జాతీయ సిక్కులు తామే సిక్కుజాతికి ప్రతినిధులమని నిరూపించుకునే అవకాశం కాంగ్రెసు కలిగించిందని కొందరంటున్నారు. కాంగ్రెసు సిక్కు అభ్యర్థులు ఎన్నికల్లో గెలిస్తే అకాలీలు సిక్కులకు ప్రతినిధులు కారని ఋజువౌతుందన్న మాట.

* * *

కాంగ్రెసు సమావేశంలో శ్రీ మహావీర్ త్యాగి "నెహ్రూ తరవాత ఎవరు?" అని ప్రశ్నించారు. ఈప్రశ్నకు సమాధానం న్యూజీలండ్ పత్రిక "ఈవెనింగ్ పోస్టు" (జనవరి 3) నుంచి వచ్చింది. కొలంబో ప్లాను సమావేశాన్ని వర్ణిస్తూ ఈ పత్రిక ఇలా వ్రాసింది:

"తన దేశానికి సంబంధించినంతవరకూ ఏకచ్ఛత్రా[illegible] అనదగిన ప్రధాని నెహ్రూ ఇటీవలి కొలంబో ప్లాను సమావేశానికి పంపించిన తన ప్రతినిధులను చూస్తే అంత సమర్థులైనవారు ఆయనకి దొరకడం ఆశ్చర్యకరంగానే ఉంది.

సమావేశానికి హాజరైన ఇతర దేశాలప్రతినిధులకు భారత ప్రతినిధులు సమర్థతలో ఏమీ తీసిపోలేదు.

ఆర్థికశాఖ డిప్యూటీ సలహాదారు డా॥ ఐ. జి. పటేల్ ఆ సమావేశంలోకల్లా సమర్థుడైన అధికారి అనిపించారు. ఈయన బొంబాయి, హార్వర్డు, కేంబ్రిడ్జి విశ్వవిద్యాల

# ★ న్యూఢిల్లీ లేఖ ★

యాలలో చదువుకున్నారు. ఇదివరకు ఎకనమిక్స్ ప్రొఫెసరుగా పనిచేసిన ఈ అధికారి అన్నిదేశాల ప్రతినిధుల ప్రశంసలనూ పొందారు. వీరి వయస్సు 32 ఏళ్ళు.

ఆయన ఇంగ్లీషు వాగ్ధాటి ఆశ్చర్యం కలిగించింది. పరిపాలనా సమర్థత, బహుముఖ విజ్ఞానం అద్భుతంగా ఉన్నాయి.

మరొక భారతీయాధికారి శ్రీ సి. ఎస్. కృష్ణమూర్తి (ఆర్థికశాఖ డిప్యూటీ కార్యదర్శి) కూడా మంచి సమర్థత, సహనం కలిగిన వ్యక్తి. మరొకసమర్థుడు కొలంబోలో కొలంబోప్లాను సమాచారఅధికారి శ్రీ ఆర్. కె. చటర్జీ. ఈయనకూడా డా॥ పటేల్ లాగా ఎకనమిక్స్ అధ్యాపకుడుగా పనిచేశారు.

సమావేశానికి హాజరైన భారతీయులందరిలోనూ మహాత్మాగాంధీ ఉపదేశ ప్రభావం కనిపించింది. గాంధీ జన్మదినమైన అక్టోబరు 2 వ తేదీన సమాజవికాసశాఖ నొకదాన్ని ప్రారంభించామని డా॥ పటేల్, మరొక అధికారి శ్రీ పి. ఎక్. సుబ్రహ్మణ్యన్ సగర్వంగా చెప్పారు.

కొలంబో ప్లానులోని భారతీయప్రతినిధులతో మాట్లాడుతున్నప్పుడు వారు కేవలం తమ ప్రత్యేక ఉద్యోగాలలో మాత్రమే ప్రావీణ్యం సంపాదించినవారు కారని పిస్తుంది. గడచిన పందఏళ్లలోకంటె పదేళ్లలోనే ఎక్కువ అభివృద్ధి జరిగిందని ఒక భారతీయ ప్రతినిధి అన్నారు. కనుక ఈ ప్రతినిధులందరూ ఆఅభివృద్ధిని ప్రత్యక్షంగా చూచి తెలుసుకున్న వారే నవడంలో సందేహంలేదు.

సూయజ్ సమస్య మూలంగా బ్రిటన్, భారతదేశాలమధ్య ఏ విభేదాలు ఏర్పడినప్పటికీ, పైన చెప్పిన ప్రతినిధుల వంటి వారి మూలంగా ఉభయ దేశాల సంబంధాలు పూర్తిగా చెడిపోవనే ఆశ కలుగుతున్నది."

* * *

## విదేశ ప్రయాణాలు

విదేశీ ప్రయాణాలకు రెండేళ్లవరకూ 750 పౌనుల కోటాను రద్దుచేస్తూ ప్రభుత్వం తీసుకున్న చర్య ఇక్కడ వివాదానికి కారణమైంది. ఈ కోటా నిలుపు చేయడంవల్ల యాత్రా పరిశ్రమకు, విమాన, నౌకాసంస్థలకు దెబ్బతగులుతుందని అంటున్నారు. విదేశీ ప్రయాణానికి అయిన ధనం ఈదిగువ అంకెలవల్ల తెలుస్తుంది. 1949 లో రూ. 9 కోట్లు, 1950 లో రూ. 14.6 కోట్లు, 1951 లో రూ. 25 కోట్లు, 1952 లో రూ. 7.4 కోట్లు, 1953 లో రూ. 9.6 కోట్లు, 1954 లో రూ. 8.4 కోట్లు అయింది. 1953 లో విదేశీ యాత్రికులవలన లభించిన ధనం రూ. 90 లక్షలు, 1954 లో రూ. 1.6 కోట్లు.

ఒక విషయం గమనించాలి. ప్రభుత్వం విదేశప్రయాణాలను నిషేధించలేదు. విదేశీ ద్రవ్యమారకం ఇవ్వగూడదని నిర్ణయించలేదు. విదేశాలకు వెళ్ళదలుచుకున్న వారికి 750 పౌనుల ద్రవ్యం ఇచ్చేపద్ధతిని మాత్రమే రద్దుచేశారు. ఇకనుంచీ ప్రయాణానుమతి కోరినవారి అర్హతాది విషయాలు పరిశీలించి, అర్హులకుమాత్రమే విదేశీద్రవ్యం లభింపజేస్తారు.

ఈ నిర్ణయంవల్ల ఎయిర్ ఇండియా ఇంటర్నేషనల్ వారి ఆదాయానికి దెబ్బ తగులుతుందన్న మాట నిజమే. యాత్రాపరిశ్రమకు, దానినుండి లభించే ఆదాయానికి దెబ్బ తగులుతుందన్నమాట మాత్రం నిజంకాదు.

బ్రిటిష్ మాసపత్రిక "ఎన్‌కౌంటర్" లో జార్జిమైక్స్ ఇలా వ్రాశాడు:

"విదేశయాత్రచేసే అభ్యాసం అంటువ్యాధిలాంటిది. అది మధ్యయుగాలనాటి వలసలను జ్ఞాపకం చేస్తుంది. ఏటా కొన్ని నెలలపాటు లక్షలాది జనం యాత్రలు చేస్తూనే ఉంటారు. హెల్సింకీ, జిబ్రాల్టర్ల మధ్య, టొర్క్వే, యాల్టాలమధ్య ఒక్క హోటలుగదికూడా ఖాళీగా ఉండదు. అండోరాప్రాంతానికి యాత్రవచ్చే ఫ్రెంచి, స్పానిష్, జర్మన్, ఇంగ్లీషు, స్విస్, స్కాండినేవియన్ (అమెరికన్లు ఇంకా రావడంలేదు) జనం ఎందుకు వస్తున్నారో అండోరావాసులకు ఇంతదాకా అర్థంకాలేదు. యుద్ధానికి పూర్వం తమదేశానికి ఏ యాత్రికుడూ రాలేదే, ఇప్పుడిన్ని వేలమంది ఎందుకు వస్తున్నారా అని వాళ్ళ ఆశ్చర్యం. మరికొన్ని ఏళ్ళలో అండోరాకు వచ్చేజనం ఏటా 5 లక్షలదాకా ఉంటారని అంచనా. రోజుకో కొత్తహోటలు లేస్తుంది; కొత్త భవనం లేస్తుంది. వ్యాపారం వృద్ధిఅవుతోంది. అండోరా రాజధానిలో కార్లు నిలుపుకోడానికికూడా స్థలం చాలకుండాపోతోందట. (ఆరాజధానిలో జనసంఖ్య 900). అండోరావాసులు విదేశీయులను మర్యాదగాచూసి, వారిడబ్బుతో జేబులు నింపుకుని రోజురోజుకీ ధనవంతులవుతున్నారు. సౌదీ అరేబియాకు పెట్రోలు దొరికినట్లు అండోరాకు యాత్రికులు [illegible]రికారు.

అయితే యాత్రికులకు తామెందుకు యాత్రలు వెళ్ళేదీ తెలుసు. అండోరా చాలా అద్భుతమైన దేశం. అంత అందమైన దేశం ఇంకెక్కడా ఉండదేమో. ప్రజలు (కాటలన్లు) అందమైనవాళ్ళు. శుచిగా ఉంటారు. ఆత్మీ కలిసికట్టుగా ఉంటారుగాని

(58-వ పేజీ చూడండి)



సుప్రీంకోర్టు న్యాయమూర్తి శ్రీ బి. జగన్నాధదాసుగారింటిలో (ఢిల్లీ) స్వామి శివానంద సరస్వతీ సంగీత సమాజంవారు జనవరి 20 వ తేదీన త్యాగరాజ ఉత్సవాలు చేసినసందర్భంలో తీసిన ఫోటో. జస్టిస్ టి. ఎల్. వెంకటరామయ్యర్ సభకు అధ్యక్షత వహించారు.

# కమలాపహరణం

[తలుపు చప్పుడుచేస్తున్న శబ్దం]

శాస్త్రి: అబ్బ ఎంత చెముడే నీకు. అర గంటనుండీ పిలుస్తున్నా పలుకుతుం దేమో చూడు. (మళ్ళీ తలుపు తడతాడు.)

సుశీల: (లోపలినుండి) ఆ! ఆ!...వచ్చె. (తలుపు తీసి) ఎందుకండీ అలా బాదుతుం టారు! తలుపు విరిగితే ఇంటివాళ్ళకు సమాధానం చెప్పలేక దుంప తెగిపోతుంది!

శాస్త్రి: (లోనికి వచ్చి) చాల్లే నేర్చుకున్నావు మాటలు! గంటసేపటి నుంచీ తలుపు కొడుతూంటే నీకు వినిపిస్తేగా! ఆ భగవంతుడు నిన్ను పూర్తిగా చెవిటిదాన్ని చేసినా బాగుండిపోయేది.

సుశీ: ఎవరికి చెవుడొచ్చిందో తెలుస్తూనే వుంది. పిల్లవాడికి నీళ్ళుపోస్తూ "వస్తున్నా" నంటే మీరు వినిపించుకుంటేగా!

శాస్త్రి: సరేలే! ఏదో అఘోరించావు! కాఫీ తీసుకురా!

సుశీ: ఇంకా వేళ కాలేదని పిల్లాడికి నీళ్లు పోస్తున్నా! ఇంతలోకే మీరొచ్చారు. ఇంకా పెట్టలేదు. ఏం పనో! పాడు పని! క్షణం తీరిక లేదు ప్రాణానికి!

శాస్త్రి: నువ్వసలే చేయలేకుండా వున్నావుగదా! కమలని పిలిపించుకో కూడదూ కాస్త సాయంచేస్తుంది కొద్దిరోజుల పాటు.

సుశీ: దాన్నే చెప్పుకోవాలి! పిల్లాడిని పట్టుకోమనిస్తే వాడిబొవ వాడిది. దీని గచ్చకాయలాట దీనిది. రోజూ బడికి పొయ్యే దాన్ని దాన్ని కబురు చెయ్యట మెందుకు లెద్దురూ! చదువుకోనీక!

శాస్త్రి: మహా చదివారు లెద్దురూ ఈ పాటికి చదివింది చాలక! ఏమన్నా ఉద్యోగాలు చెయ్యాలా! ఊళ్ళేలాలా!

సుశీ: ఏమో చేస్తే చెయ్యగూడదా ఏమిటే?

శాస్త్రి: అవునవును. చెయ్యొచ్చు. మీ అక్కయ్య చెయ్యటంలా! పెళ్ళి చేస్తే యీ పాటికి నలుగురు పుట్టుకొస్తారు.

సుశీ: ఆ పుడతారు! తొందరపడతా రెందుకు! అదో పెద్ద సంబరమా ఏం!

శాస్త్రి: సరయిందే యిప్పుడే మీ నాన్నకు వుత్తరం వ్రాస్తా.

సుశీ: ఏమని?

శాస్త్రి: "ఇక్కడ మీ అమ్మాయి పిల్ల వాడితో పని చేసుకోలేక ఇబ్బందిపడుతోంది గనక తక్షణం కమలను తిరుగుటపాలో పంపాల్సింది" అని.

పాత్రలు:

- శాస్త్రి
- సుశీల
- కమల
- మహేశయ్య
- సుభద్రమ్మ

సుశీ: ఏమో! మీ యిష్టమొచ్చినట్లు రాసుకోండి నాకు తెలీదు.

## 2

శాస్త్రి: సుశీ! సుశీ!

సుశీ: ఏమిటండీ!

శాస్త్రి: అబ్బాయేడీ!

సుశీ. ఇప్పుడే అన్నంతిని నిద్రపోతున్నాడు.

శాస్త్రి: కమలం ఎంతపని చేసిందో చూశావా!

సుశీ: (ఆదుర్దాగా) ఏం జేసిందండీ?

శాస్త్రి: ఏం జేస్తుంది! ఎవడివెంటనో పడిపోయింది?

సుశీ: మీ కెట్లా తెలుసు! ఎవరు చెప్పారండి! నాన్న వుత్తరం వ్రాశారా? సంగతేమిటో వివరంగా చెప్పండి!

శాస్త్రి: ఏం చెప్పమంటావ్! యీడొచ్చినపిల్ల! పైగా యింగ్లీషు చదువాయె! అబ్బో ఎక్కడలేని ఫ్యాషనులు వచ్చిపడ్డాయి. ఇంక వాళ్ళు చెప్పినమాట వినమంటె ఎట్లా వింటారు?

సుశీ: (భయంగా) ఏమిటండీ యిదంతాను!...నా కంతా అయోమయంగా వుంది!...సంగతేమిటో తేల్చిచెప్పండి!

శాస్త్రి: చెప్పేందు కేముంది! మీ నాన్న నేను వ్రాసినవుత్తరం చేరగానే అమ్మాయిని పంపుతున్నాను. స్టేషనుదగ్గరికి రావలసిందని వ్రాశాడు. సరేనని స్టేషనుకు వెళ్ళాను. రైలు వెళ్ళింతర్వాత వచ్చి చూద్దునుగదా దూరంగా ఒక బండిలో కమలం దాని నానుకొని ఇరవైఏళ్ళ యువకుడొకడూ కూర్చొని నవ్వుకుంటూ పోతున్నారు.

సుశీ: మీరు సరిగ్గా చూశారుటండీ! ఆ తొందరలో ఎవరినిచూచి ఎవరనుకున్నారో!

శాస్త్రి: నా కింకా అంత చూపు మందగించలేదులే! మీ చెల్లెల్ని నే నెరగనా ఏంటి! ఎర్రటిపిల్ల. ఆ చిలిపికళ్ళు. ఆ సొట్ట బుగ్గలు. ఏమీ సందేహంలేదు! ఆ అమ్మాయి మీ కమలమే!

సుశీ: అయ్యో ఇప్పు డెట్లాగండీ!

శాస్త్రి: చేసేదేముంది? అనుభవించడమే!

సుశీ: మీరైనా వెళ్లి దాన్ని లాక్కురాలేక పోయారా?

శాస్త్రి: ఇంకా నయం! నడి బజార్లో దాన్ని కందకి లాగితే అది ఎదురుతిరిగి "ఎవరు నువ్వం"టే నా వళ్ళంతా మెత్తమెత్తగా చితక్కొట్టి పారేయరూ అక్కడి జనం!

సుశీ: ఇంకా చూస్తారేమండీ! ఇంటికి తక్షణం టెలిగ్రాం యియ్యండి.

శాస్త్రి: ఏమని యియ్యమంటావ్!

సుశీ: ఏమని ఏమిటండీ! ఇట్లా మీ అమ్మాయి బండిలో ఎక్కి ఎవడితోనో వెళ్తున్నది. మీరు తక్షణం బయలుదేరి రండని.

శాస్త్రి: చంపేశావ్! ఇంక నేనుగాని మీ నాన్నగాని తలెత్తుకు తిరగాలా అక్కర్లేదా!

సుశీ: అట్లా అంటారేమండీ!

శాస్త్రి: అట్లా కాక యింకెట్లా అనమంటావ్! మీ అమ్మాయి ఎవడితోనో లేచిపోయిందని టెలిగ్రాం యిస్తే ఇంకేమన్నా వుందా! కొంపలంటుకు పోతాయ్! ఏమనుకున్నావో! ఈ వూళ్ళోనూ, ఆ వూళ్ళోనూ ఫలానివారమ్మాయి ఎవడితోనో లేచిపోయిందని ప్రాకిందంటే మనకింక పచ్చిమంచి నీళ్లు గూడా పుట్టవు.

సుశీ: (ఏడుపుతో) ఇంతకీ ఏం చేద్దామంటారండీ!

శాస్త్రి: చేసే దేముంది! కమలాన్ని తీసుకుపోయినవాడి యిల్లు గుర్తు పెట్టుకొని వచ్చాను. రేపు నేను వెళ్లి మీ అమ్మా నాన్నను వెంటబెట్టుకొనివచ్చి అక్కడికి

"పారిజాతం"

వెళ్ళి సంగతి సందర్భాలు ఆలోచిద్దాము. ఏమంటావ్!

సుశీ: అయితే యీ పూట బండికే పోగూడదూ! ప్రొద్దున్న బండికి తీసుకు రావచ్చు.

శాస్త్రి: అబ్బ! వంట్లో ఏమీ బాగుం డ్లేదే! ఈ పాట్నా బయలుదేరితే అడ్డం పడాల్సి వస్తుంది.

సుశీ: సరే మీ యిష్టం! మీరు మాత్రం వాళ్ళని వెంబడి పెట్టుకు తీసుకొచ్చి ఏదో ఒకటి చెయ్యకపోతే నేనిక్కడ బతకలేను. (అంటూ వెళ్లుతుంది.)

శాస్త్రి: (నవ్వుకుంటూ) పిచ్చిదానా! ఎంత బాధ పడుతున్నావ్!

## 3

[బయట తలుపుచప్పుడు]

మహేశయ్య: అమ్మాయ్! సుశీలా! తలుపు తీయమ్మా!

సుశీల: (దొడ్లోనుండి) ఆ! ఎవరదీ?

మహే: నే నే నే అమ్మాయ్! నాన్నని!

సుశీల: ఆ! వస్తున్నా!

[తలుపు తీస్తుంది! మహేశయ్య, సుభద్రమ్మ, కమల కనిపిస్తారు. సుశీల ఆశ్చర్య పోతుంది]

సుశీల: (కమల చెయ్యిపట్టుకొని బరబర లోపలికి తీసుకుపోయిఒక్క చెంప దెబ్బ యిస్తుంది)

కమల: (ఆశ్చర్యం! ఏడుపూ రెండూ మిళితంకాగా) ఏమిటక్కా యిది!

సుశీ: ఏమిటా! నువ్వు చేసిన దరిద్రపు పనికి బహుమానం!

[ఇంతలో ముసలివాళ్ళిద్దరూ లోపలికి వస్తారు. ఆదృశ్యం చూసి ఆశ్చర్యపోతారు]

సుభద్రమ్మ: ఏమిటే! ఏమిటే!

[అంటూంది ఆదుర్దాగా]

సుశీ: ఏమిటా! దీనిబొంద! ఎవడే వాడు. నిన్న వస్తే తిన్నగా యింటికిరాక ఎవడితోనో బండిలో పడిపోతావా? మీబావ కనిపిం చినా ఎవరో అన్నట్టు తప్పుకుపోతే సరిపో తుందనుకున్నావు గావును. మేమంతా ఏమైనామని! చదువుతున్నది చదువు! దీని శ్రాద్ధపు చదువు!

మహే: సుశీ, ,సుశీ, ఏమిటమ్మా యీమాటలు:

సుశీ: మీరూరుకోండి నాన్నగారూ! మీ అతిగారాబమే దిన్నింతవరకూ తెచ్చింది చెట్టై వంగంది మానై వంగుతుందా!

సుభ: ఏం చేసిందే! ఉత్తిపుణ్యానికి అలా కొట్టావేమే!

సుశీ: కొట్టాలా పాతెయ్యాలా! ఏంచేస్తే పాపముంది దిన్ని! పదిహేనే ళ్ళొచ్చాయో లేదో అప్పుడే ప్రేమకలాపాలు, గీము



ఆంధ్ర విశ్వవిద్యాలయం గత డిసెంబరులో జరిపిన కళాశాలల నాటకాల పోటీలో స్త్రీ వేష ధారణకు వైస్‌చాన్సెలర్ చే మొదటి బహుమతి పొందిన తర్డ్ ఆనర్సు విద్యార్థి శ్రీ వి. వి. భానోజీరావు.

కలాపాలు! మీ కెక్కడ దొరికిందిది. ఆబజా ర్లోనే పారేసి రాకపోయారు. పీడా వదిలి పోయేది.

మహే: } ఏమిటే నువ్వంటున్నది! మాకు
శుభ: } మొదలు చివర తేలకుండా వుంది.

[శాస్త్రి ప్రవేశం]

శాస్త్రి: (నవ్వుతూ) మరదలుగారికి అక్కగారేదో బహూకరించినట్టుందే! ఏయ్‌పిల్లా! ఏదీ చూడనీయ్! (అని దగ్గరికి పోవును. కమల కోపముతో తల్లిచాటుకు పోతుంది.)

సుభ: ఏమిటి నాయనా యిది! సుమ్మంలో అడుగుపెట్టామో లేదో అదేమో దీని దవడ మీద ఒక్కటేసి ఏమిటేమిటో వాగుతున్నది. నాకేమీ బోధపడటం లేదు.

శాస్త్రి: అబ్బే ఇందులో బోధపడ్డే. దేముంది, సుశీ చెప్పలా? దాన్నే అడగండి!

సుభ: ఏమిటే సుశీ యిదంతా!

సుశీ: నా ప్రారబ్ధం! మీ గ్రహచార మూను! నిన్న బండి దిగింది ఇంటికి సరాసరి రావచ్చుగదా, ఎవడో మొగవాడితోబండిలో ప్రక్కన కూర్చొని కబుర్లు చెపుతూ తాను కనబడ్డా చూడకుండా పోయిందిట!

మహే: ఓసి నీయిల్లు బంగారంగానూ అది మాతోబాటే బండిదిగి వస్తూంటే నిన్న రావడమేమిటి. ఎవడిబండి లోనో పోవట మేమిటి! ఇవ్వాళ ముగ్గురం వస్తున్నామని ఉత్తరం వ్రాశానుగా!

సుశీ: (ఆశ్చర్యపోతూ) ఇవ్వాళొస్తు న్నారూ! అది నిన్న రాలా? మరి మీ అల్లుడు కమలని చూశానంటూ వర్ణించి చెపితే!

మహే: ఏమిటి శాస్త్రీ యిది!

శాస్త్రి: పూర్వగాథ చాలా వుందిలెండి!

సుశీ: ఏమిటండీ అది! నాకేం బోధపడ కుండా వుంది!

శాస్త్రి: మీ కెవ్వరికీ బోధపడదులే! అర్థంకావాల్సినవారికి మాత్రమే అర్థమ వుతుంది.

సుభ: ఏమిటో తిన్నగా చెప్పు నాయనా!

శాస్త్రి: (కమలవంక చూస్తూ) పాపం! అసలే ఎర్రటి బుగ్గ అందుమీద అక్కగారి అయిదు వ్రేళ్ళు! ఛి! ఛి!...జ్ఞాపక ముందా మరదలు పిల్లా! నేనొకసారి మీ యింటికి వచ్చినప్పుడు ఆకులు రాసి యియ్య మంటే నాదవడ పొక్కేలా సున్నంరాసి యిచ్చావు. ఆమంట వారం రోజులదాకా తగ్గలేదు. ఇదేముంది రేపటికల్లా తగ్గిపోతుంది.

సుశీ: ఏమిటండీ ఆమాటలు!

శాస్త్రి: మీ చెల్లమ్మ చేసిన పనికి ప్రతీ కారం!

సుశీ: అంటే మీరు చేసిన పనులు చెప్పిన మాటలూ అన్నీ అబద్ధమే నన్నమాట!

శాస్త్రి: అని ఎవరన్నారు?

సుశీ: అనేదేమిటి ప్రత్యక్షంగా కనబడు తూంటేనూ! కమలం ఎవడితోనో పోయిం దని...బిడ్డని అనవసరంగా కొట్టాను తొం దరపడి...[అని కమల దగ్గరికి పోయి చూడ బోగా కమల కోపంతో చేతులు ప్రక్కకు నెట్టుతుంది.]

శాస్త్రి: నే నేం అబద్ధం చెప్ప లేదు నీతోటి! నాకేం అంత ఖర్మకాలింది. నిన్న కమలాన్ని వాడు తీసుకుపోవటం కళ్ళారా చూశాను కాబట్టి చెప్పాను అంతే!

సుశీ: కమలాన్ని చూశార్ట! కమలాన్ని! పైగా మాటలు చెప్పొచ్చారు!

శాస్త్రి. చెపితే నమ్మరు గదా మీ ఆడ వాళ్లు. కమలాన్ని తీసుకు వెళ్ళాడంటే ఈ కమలాన్నే నా, [illegible] వలసినన్ని కమలా లున్నాయి. కమ[illegible] అంటే తామర పువ్వు. ఎర్రతామరపువ్వు దాన్ని వాడెవడో వెంబడి తీసుకువెళ్ళాడు. అంటే కమలాన్ని వెంబడి తీసుకుపోయాడన్నమాట!

సుశీ: మరి యీ అపవాదేమిటి!

శాస్త్రి: మీ చెల్లమ్మ చేసిన పనికి గుణ పాఠం!

[అందరూ విరగబడి నవ్వుతారు. తెర] ★

# అమ్మమ్మ రూపాయినోటు



రామవరపు
వెంకట రమణమూర్తి

ఆఫీసునుండి యింటికొచ్చేసరికల్లా, అమ్మమ్మ వీధి వాకిట్లోనే ప్రత్యక్షమై 'లబోలబో'మంటూ ఏడుపు లంకించుకుంది. ఏం అఘాయిత్యం జరిగిందో తెలీక, తెల్లమొఖం వేసి అలా వీధివాకిట్లోనే నిల్చుండిపోయాను.

"ఒత్తులపెట్లో దాచుకున్న రూపాయనోటుని ఎవరో ఎత్తుకపోయార్రా నాయనా!" అంటూ ఓసారి ఝుర్రున చీది, పైట చెంగుతో, ముక్కు చెలమలూ—కళ్లనీళ్లూ ఒత్తుకుంది. "హే భగవాన్!" అని, ఇంట్లోకి అడుగుపెట్టి, కుర్చీలో కూలబడ్డాను. ఇంతలో శ్రీమతిగారు పొగలుకక్కే వేడి కాఫీ బల్లమీదపెట్టి నా వైపూ, అమ్మమ్మ వైపూ ఓ తీక్షణ వీక్షణాన్ని విడిచి, చరచరా లోనికి వెళ్ళిపోయింది. వేడి కాఫీని ఓ గుక్కెడు గొంతులో పోసుకుని—ఎదురగా నిల్చున్న అమ్మమ్మకేసి చూస్తూ.

"జరిగిందేదో కాస్త వివరంగా చెప్పు, అమ్మమ్మా!" అన్నా రీవిగా.

"ఏముందిరా అబ్బాయ్! నిన్నసుందిరా ఆ నోటు. ఇవాళ ఉదయం వంటయాక దేవుడికి దీపం పెట్టుకుందికి వత్తులపెట్లోని ఒత్తి తీసి, అడుగున పెట్టిన రూపాయనోటును చూద్దాం అని, ఒత్తులు ఒత్తిగించి చూద్దును కదా! ఆ నోటు కనిపించలేదు. ఒత్తులూ-పత్తిబొగలూ అన్నీ కలగాపులగంగా ఉన్నాయ్. ఆమట్టున కాళ్ళూ చేతులూ ఆడక, ఇల్లంతా వెదికేశానురా అబ్బాయ్! ఎవర్నడిగినా 'మాకేం తెలుసూ?' అనేశార్రా యింట్లో అంతా."

"ఊఁహూ!... పోనీ అమ్మ నడిగి చూశావా?"

"తనకి తెలీదందిరా, చీమూ, నెత్తురులా కానీ—పరకా కూడబెట్టుకుని, నిన్నటికి ఓ రూపాయి చేసుకున్నాను. చిల్లరగా ఉంటే ఖర్చైపోతుందని, నిన్ననె రంగమ్మగారు చిల్లరకావాలని అంటూంటే, ఆవిడకిచ్చేసి, ఆనోటు తీసుకున్నారా అబ్బాయి. వస్తోన్నది కార్తీకమాస మాయిరి; ఆవునెయ్యి కొని, కార్తీక దామోదరుడికి దీపారాధన చేసుకుందామని ఆశపడ్డారా నాయనా, ఆఖరికిలా అయింది. వాళ్ళచేతులు విరిగిపోనూ—ఎవరికేం పొయ్యేకాలం ఒచ్చిందోను—"

అంటూ తిరిగీ యేడుపు లంకించుకుంది.

పాపం! అమ్మమ్మ చిరకాలవాంఛితం యీ విధంగా అంతమవడం చాలా విచారించ తగ్గదే, అయినా అమ్మమ్మ ప్రస్తుత ధోరణి మాత్రం కాస్తచిరాకు కలిగించింది.

"నువ్వుకాస్త తాపీపడాలి అమ్మమ్మా! అనవసరంగా యేడుస్తూంటే నేనేంచేయగల్ను?" అన్నా, కాస్త మందలింపుగా.

"యేడవక సంతోషించమంటావట్రా? రూపాయినోటు పోతే?" అంది ఉక్రోషంగా.

"అదికాదే. నువ్వుకాస్త తాపీపడి, నే అడిగేవాటికి సమాధానాలియ్యకుంటే, ఎవరు దొంగ[illegible] చేశారో ఎలా కనుక్కోవడం?" అన్నా[illegible]

"సరేబాబూ! నువ్వుకాస్త కష్టపడి, నారూపాయి దొరికేలాచూస్తే నాకదేచాలు కొత్తనోటురా నాయనా!" అంది. మరో మాటు కళ్ళొత్తుకుని.

నేను నా పరిశోధనా కార్యక్రమం ప్రారంభిస్తూ, అందరి డిటెక్టివ్‌లలాగే ముందుగా నాక్లయింటుని ప్రశ్నించటం ప్రారంభించా.

# అమ్మమ్మ రూపాయినోటు

"సరే. నే అడిగేవాటికి సూటిగా సమాధానాలియ్యి తెలిసిందా?... ఆ నోటు ఎక్కడుంచావ్?"

"ఒత్తులపెట్లో. - దేవుడిగుమ్మటం అరుగు మీదుంది ఆపెట్టె."

"అందులో యేమేమి టున్నాయ్?"

"ఒత్తులపెట్లో యేం వుంటాయిరా? ఒత్తులూ, పత్తిబోగలూ, విభూతిపండున్నా దప్పు?"

"సరే. నీదగ్గర ఆ రూపాయి ఉన్నట్లు యెవరెవరికి తెల్సు?"

"ఆసంగతి నాకేంతెల్సబ్బాయ్! తీసిన వెధవలికి తెలిసుండాలిగాని."

"పోనీ. నువ్వారూపాయి అందులో దాచగా, ఎవరన్నా చూశారా? బాగా జ్ఞాపకంచేసుకో."

"అబ్బే! ఎవరూ చూడనేలేదు. ఎవరూ లేకుండా చూసే ఆనోటందులో పెట్టాను."

"నువ్వానోటుని ఎప్పుడుమార్చి తెచ్చావన్నావ్?"

"నిన్న సాయంకాలం. రంగమ్మగారు చిల్లర తెమ్మని వాళ్ళ అబ్బాయికి ఆ నోటు ఇస్తూండగా, నేయిస్తా తెమ్మని, ఆనోటు తీసుకుని ఆవిడకి చిల్లరిచ్చేశాను."

"నువ్వానోటుని ఆఖరిసారిగా, అంటే పోయిందని తెల్సుకోకముందు, ఎప్పుడు చూశావ్?"

"నిన్న సాయంకాలం. ఫలహారం అయాక."

"అప్పటికి ఎన్నిగంటలయుంటుంది?"

"దీపాలు పెట్టేరు. గంటలునాకేంతెల్సు నబ్బాయ్?"

"పొరబాటువగానీ, మళ్ళా ఆరూపాయిని యే పోపులడబ్బాలోకేనా మార్చేశావేమో జ్ఞాపకంచేసుకో ఓసారి."

"ఏడ్చినట్టే ఉందిరా నీ సలహా! నోటు అందులో పెట్టేక, చిల్లరతీసి రంగమ్మగారికిచ్చాను. ఫలహారం అయాక, ఓసారి ఎందుకేనా మంచిదని పెట్టె మూతతీసి చూశాను. అప్పుడుకూడా ఉంది."

"అంటే, నిన్న సాయంకాలం ఆనోటుని ఎవరూ చూడకుండా ఆ పెట్టెలో పెట్టావ్. దీపాలవేళ నీ ఫలహారంఅయాక చూసుకుంటే నోటు నువ్వు పెట్టినస్థలంలో సురక్షితంగా ఉందికూడాను. ఇవాళ ఉదయం వంటయాక దేవుడికి దీపారాధన చేసుకుందికి వత్తులపెట్టె తీసి చూసుకుంటే అది అందులో లేదు... అంటే పోయిందన్నమాట..."

మాట సాంతంకాకుండానే, మధ్యలోనే అందుకుంది అమ్మమ్మ.

"ఏడిసినట్టేఉందిరా నీ పత్తేదారుతనం. మిడతంభొట్లు జోస్యంలాగు. పోయిందని నాకూ తెల్సు. ఆమాత్రం తెలీక నీతో నేను చెప్పకోలేదు. యేవిటో మహోయిదిగా, దొంగల్ని పట్టుకునే-పోలీసుపనులు (అంటే ఆవిడగారి ప్రవచనంలో అర్థం 'డిటెక్టివ్' అని) పుస్తకాలు తెగరాసేస్తూంటే, నా గోడుకూడా నీతో చెప్పకున్నాను; నువ్వేదో నెలగబెట్టి ఒరగదోస్తావని...అయింది. ఆ ఆశ కూడా తీరిపోయింది."

పూర్తిగా నామాటలు వినకుండా-నా శక్తి గమనించకముందే, ఆవిడగారిలా తన అభిప్రాయాన్ని నాముందరే బయట పెట్టేసరికి, ఎక్కడలేని కోపం వచ్చి-నావళ్ళు మండుకుపోయింది. అయినా కార్యవాదిని కావడం చేతా-చిరకాల వాంఛితమయిన నాకోరిక తీర్చుకుందుకు, యీనాటికి లభించిన యీ సదవకాశాన్ని జారవిడవటం యిష్టంలేక-ముసిలానితో ఘర్షణేమిటని ఊరుకున్నా.

నేను నా ఆలోచనల్లో, మునిగి, అమ్మమ్మతో మాట్లాడకపోవటంతో, ఆవిడగారు అక్కడినుండి చల్లగా జారుకుంది. నిరాశగా అమ్మమ్మ అక్కడినుండి కదలగానే చుట్ట వెలిగించి ఆలోచనలకి 'స్టీమ్' ఎక్కించాను. అంతవరకూ అమ్మమ్మ, ఒక రూపాయకి 'అధినేత్రి' అన్న సంగతే నాకు తెలీదు. "ఇంతకీ రూపాయినోటు ఎవరు తీసుంటారు?" అన్నదే తేలని సమస్య. ఇంట్లో ఉన్నది అమ్మ-నాన్న-నాభార్య-నేనూ-అమ్మమ్మ. ఈ ఐదుగుర్లోనూ ఆ రూపాయినోటు ఎవరు తీసుకుంటారు? తీసేందుకు-అవకాశాలూ, అవసరాలూ ఎవరికి ఎక్కువ ఉన్నాయి? లిస్టులో ఉన్న యీ ఐదుగుర్లో, ఎవరో ఒకరు తీసిఉండటం మాత్రం ఖాయం. కారణం ఎవరూ తియ్యకుండా, పెట్లో పెట్టిన రూపాయి హరించుకుపోవడానికి అవకాశాలు లేవు. అందువల్ల ఒక్కొక్కరి గురించే వేరువేరుగా, ఆలోచించడం మొదలెట్టాను.

నాన్న: నాన్న ముసలాడు. అదీగాక దేవుడిగదిలోకి వెళ్ళవలసిన అవసరంగాని, అమ్మమ్మ దాచుకున్న రూపాయని దొంగిలించాల్సిన అవసరంగాని ఆయనికిలేవు. ముఖ్యంగా నాన్న సాయంకాలం చల్లగాలికి వీధిఫెన్సింగులో కుర్చీవేసుకుని, కాస్సేపు కూర్చోవటం - భోజనంవేళల్లో వంటయింట్లోకి వెళ్ళడం, ఉదయం పూట కాలకృత్యాలు, స్నానవగైరాలకి పెరట్లో ఓగంటకాలం మినహా, మిగతా వేళల్లో ఆయనగారు, తన గదివదిలి బైటకేరారు. కాబట్టి, యీ దొంగతనంతో ఆయనకెట్టి ప్రమేయం ఉండదని భావించడం న్యాయవిరుద్ధం కానేకాదు. కాబట్టి, లిస్టులోనుండి నాన్న [illegible] పేరు తొలగిస్తే మిగిలిన నలుగుర్లోనూ [illegible]దటిది అమ్మ.

అమ్మ: తల్లి ప్రాణపదంగా దాచుకున్న రూపాయని కాజేసేటంత నీచత్వానికి కూతురు ఒడికడుతుందా? అన్న అంశం విచారణీయమే. మొగల్ చక్రవర్తుల్లో చాలామంది తల్లిదండ్రులనీ - అన్నదమ్ములనీ కూడా హతమార్చారు సింహాసనానికోసరం. అంతేకాదు. డిటెక్టివ్ సాహిత్యంలో కూడా, ఇటువంటి ఘోరాలు జరిగినట్టు దాఖలాలున్నాయి. అటువంటప్పుడు లోభిత్వానికి పుట్టిల్లయిన స్త్రీస్వభావం, అమ్మ

చేత యీపని, ఎందుకు చేయించి ఉండ కూడదు ? గాని. ఇక్కడిపరిస్థితే వేరు.

దేవుడిగదిలోకి నిరభ్యంతరంగా ప్రవేశించగల అవకాశం - సాహసం ఒక్క అమ్మకి మాత్రమే వుంది. ఆవిడకూడా రోజూ మహాలక్ష్మిపూజ చేస్తుంది. కాబట్టి వత్తుల పెట్టెతో అమ్మమ్మకున్నంత సన్నిహితత్వం ఆమెకు కూడా వుంది. కాబట్టి, ఆమెని అనుమానించడంలో 'సాహసం' అట్టే లేదనే నా నమ్మకం. ఐతే మరోకోణంలో నుండి కూడా ఆలోచించాల్సిన అవసరం వుంది.

అమ్మమ్మ కూడబెట్టుకున్న ఈ నిధి అప్పటప్పట-పండ్లూ, ఫలహారాలకై అమ్మ యిస్తూ వచ్చిన డబ్బుల్లో మిగిల్చిన బాపతే గాని, వేరేమీ కాదు. అంతే కాకుండా, అమ్మకీ విషయంలో ప్రమేయం లేదనేందుకు మరికొన్ని ఘట్టి కారణాలు కూడా ఉన్నయి. మొన్ననే అందుకున్న జీతం అంతా అమ్మకే ఇచ్చేశాను, నా ఖర్చులకి మినహాయించుకుని. ఏనెలా కూడా డబ్బుకుగాని, ఇంట్లో సామగ్రికి గాని ఇంతవరకూ, చింతపడకండా గడుపుకురావడమే గాకుండా, ప్రతీ నెలా, కొస్తో కూస్తో మిగుల్చుతూనే ఉంది. అటువంటప్పుడు అమ్మమ్మ రూపాయినోటునే దొంగిలించాల్సిన ఖర్మం యేంపట్టింది? ఓవేళ అమ్మ ఆరూపాయనోటుని చూసి, యే అవసర నిమిత్తమో ఓవేళ తీసుకున్నా, అమ్మమ్మ అడిగినప్పుడైనా ఆమె తప్పకుండా ఒప్పుకుని, తాను తీసినట్లు చెప్పుండాలి. అలా కాకుండా సాంతం తనకి 'తెలీదు' అని ఎందుకంది? తాను తీయలేదు గనకే. కాబట్టి ఏది ఎలా అయినా కొస్త ఇన్‌ఫర్‌మేషన్ కోసరమైనా అమ్మనీవిషయం గురించి అడిగి తెల్సుకోవాలి.

అమ్మమ్మ: అసలు పోయిన రూపాయినోటుకు అధినేత్రి, నాకు క్లయింటూ యీవిడే. గాని, మరో విషయం ఎక్కడయినా పెట్టి పోయిందనుకున్న గాభరాలో అందర్నీ అనుమానిస్తూనైనా ఉండొచ్చు, లేదా ఇలా పోయిందని ఏడుస్తేపోనీలెమ్మని అమ్మగాని మరో రూపాయైనా యిస్తుందన్న ఆశ అయ్యుండొచ్చు. ఆవిడ ముఖం ఆబాధా చూస్తూంటే, ఈ రెండో రకం అనుమానానికి ఎక్కడా ఆస్కారం చూపించడం లేదు. కాబట్టి ప్రస్తుతానికి యీవిణ్ని కూడా లిస్టులో నుండి తొలగించుతే మిగిలింది నేనూ-నా శ్రీమతి.

నేను: నన్ను గురించి నేను ఆత్మవిమర్శన చేసుకోవడం కంటే శుద్ధ తెలివి తక్కువ యింకోటి ఉండదు. కారణం అమ్మమ్మ తన రూపాయనోటు నెవరో కాజేశారని అన్నంతవరకూ ఆవిడ గారు ఓ రూపాయకి అధికారిణి అన్న విషయమే నాకు తెలీదు. పోగా ఇంక మిగిలింది నా శ్రీమతే.

నా శ్రీమతి:- నా భార్యనే నేను అనుమానించవలసివచ్చినందుకు మన సెంతో చివుక్కుమంది. అయినా ఏం చేయగలను. వృత్తిధర్మం అనుసరించి, స్వ, పర భేదం చూపడం భావ్యంకాదుగనక, కాస్త కించపడుతూనే దాన్ని తర్కించడం మొదలెట్టాను.

మొదటిది: దాని కటువంటి సాహసం చేయగల అవసరం - అవకాశం ఉందా ? అన్నదే విచారించాల్సింది. అసలాగదిలోకి, మడిబట్టలు కట్టుకోకుండా ప్రవేశించే అవకాశం యింట్లో ఎవరికీ లేదు. ఓవేళ పూజ చేసేందుకయినా ఆ యింట్లోకి అది వెళ్ళవలసి వచ్చినా - అమ్మతోసహా వెళ్ళి అమ్మ గైడింగ్‌లో పూజావిధులు పూర్తిచేసుకు రావలసిందే గాని, ఇండిపెండెంటుగా తనకు తానుగా పూజామందిరంలో ప్రవేశించగల అధికారం, చొరవా దానికి లేవు.

ఇంక దాని గుణం :- అప్పటప్పట మాసిన బట్టల్లో అర్ధా, రూపాయి మరచి, చాకింటికేయవలసిన గుడ్డల్లో పడేస్తే - జాగ్రత్తగా జేబులు తణిఖీ చేస్తూ - వాటిని జాగ్రత్తగా పెట్టి, ఆఫీసునుండి వచ్చేక నాకిచ్చే సంఘటనలు అనేకం ఉన్నాయి.

దానికున్న అవసరం?-ఎవరైనా, ఏదైనా చేశారంటే ఆ సాహసకార్యానికి తగినంత బేక్‌గ్రౌండ్ ఉండితీరాలి. ఒక రూపాయి దొంగిలించి ఎవరు గాని, పొందగల పెద్ద లాభం యేం వుంటుంది? ఓవేళ నా భార్యే అది తీస్తే తనకి ఆ రూపాయితో తీరగల కోర్కెలంటూ యేం వుంటాయి? రిబ్బనూ - స్నో యిత్యాది మినహా మరే ఖరీదయిన సామగ్రినీ అది పొందనే లేదాయె. అదీగాక, జీతం అందగానే దానికి కావలసిన టాయ్‌లెట్ పరికరాలూ-రిబ్బన్‌లూ-ఊలూ-లేసు ధారం నా చేత పుష్కలంగానే కొనిపించింది. దానికి అమ్మదగ్గిరా-నాదగ్గిరాకూడా కావలసినంత చొరవా-స్వతంత్రం కూడా ఉన్నాయ్. అది అడగాలే గాని, అమ్మ ఎప్పుడూ కాదనకుండా తెచ్చి యివ్వడం నే యెరుగుదును. అటువంటప్పుడు ముష్టి రూపాయి దొంగిలించేఅవసరం యేమీ కనుపించలే.

ఇంక నాఆలోచనలకి అంతు చెప్పి, రంగంలోకి దూకేను. నాలిస్టులో ప్రశ్నించవలసింది అమ్మ, నా భార్య రత్నం, ఇంట్లో ప్రస్తుత నా తావరణాన్ని బట్టి చూస్తే అమ్మమ్మ మన కీవార్త చేరవేసే ముందుగా, చాలా రాద్ధాంతం జరిపి ఉంటుంది. కాబట్టి, మన డిటెక్షన్‌లో ఏమాత్రం పొఱ్ఱు ఎక్కువయినా - తక్కువయినా అగ్నిపర్వతాలు పగిలేంత ప్రమాదం ఉందని రూఢిచేసుకున్నా, కాబట్టి మన పాత్ర చాలా నైపుణ్యంగా నిర్వహించుకురాకుంటే, అమ్మమ్మ రూపాయి మాట దేవుడెరుగు కాని, మనపాట్లు కుక్కలుకూడా పడవ్.

ఆరిపోయిన సిగరెట్టుకి అగ్నిసంస్కారం చేసి, ఓ రెండుదమ్ములు కులాసాగా లాగి, శ్రీమతిని కేకేసి పిలచాను. అమ్మమ్మ పరిసరాల్లో లేకపోయినందువల్ల, శ్రీమతి కాస్త మందగమనంతో వయ్యారంగా వచ్చి, లేని నవ్వును ఎరువుతెచ్చుకుంటూ, చేతులు కట్టుకుని నా ముందు నిలుచుంది. ఆ భంగిమలోని భావం "అడగ దల్చుకున్న దేదో అడిగెయ్" అన్నట్లుంది. నా గుండెలు గుభేలుమన్నాయి. "మన ప్రథమ ప్రయత్నమే యిలా వికలమైతే ఇంక అమ్మదగ్గర అగ్నిపర్వతాలే పగలొచ్చు" అనుకున్నాను. ఏ పాపమూ ఎరగని నేనే ఓ దొంగలా అయిపోయా ఓ క్షణం వరకూను. ఆనక కొస్త తెప్పరిల్లి-మనసు దిటవు చేసుకుని, డిటెక్టివ్ కలాపం ప్రారంభించాను.

"మాడు రత్నం! అమ్మమ్మ రూపాయి..." వాక్యం పూర్తవకుండానే అందుకుంది రిహార్సలు చేసిన స్పీచిలాగు.

"నేనే తీశాను. మిమ్మల్ని కట్టుకుని-మీ యింటికొచ్చింది ముసిలిముండ దాచుకున్న ముష్టిరూపాయి దొంగలించి మా వాళ్ళ ముప్పు గడపాలనేను"-ఇకపై మాటలు పెకిలి రాక, కళ్లెంబడి ధారాపాతంగా బైట పడేసరికి, పైట చెరుగుతో ముఖం కప్పుకు కన్నీటిని తుడుచుకోసాగింది.

శ్రుతి తారకస్థాయిలో ప్రారంభం అవడం వల్ల ఏంచేయాలో అర్థంగాక, అడగదల్చుకున్నవి, నాలుక చివర్నే ఆగిపోయాయి. అంతితో దుఃఖోపశమన క్రియాకలాపాలని వెదకాల్సి వచ్చింది.

"అబ్బే! ఛా! ఎందుకలా ఏడవటం? ఏం అన్నానని? నువ్వు దొంగలించే వన్నానా నేను. ఆ విషయం గురించి నీకేమయినా తెల్సా అని అడుగుతూంటే, అలా ఎందుకేడుస్తావ్? ఎవరేనా వింటే ఏం అనుకుంటారు?" అన్నా కొస్త లాలనగా, దగ్గిరకి లాక్కుని.

"ఆవిడగ్గారంటూన్న చేటిమరి?" తీక్షణంగా నా[illegible]పోసారి చూసి, నా దగ్గిరనుండి సమాధా[illegible]రాకపోయేసరికి, మూతి ముప్పై వంకర్లు తిప్పి, చెప్పసాగింది.

"మీ అమ్మగారు తీయరట - మావగారు ఆగదిలోకే వెళ్లరట - మీకు మీ ఆఫీసుపని కథలు రాసుకోవడం మినహా యితరలోకంతోనే సంబంధంలేని వెర్రి నాయనమ్మలట...ఇక మిగిలిందెవరు? నేనే కదూ? ఈవిడగారి యింతోటి ఖజానానూ కొల్లగొట్టకుంటే నాకు గడవదనా? లేకపోతే మావాళ్ళకి గడవదనా ఆవిడ నేడ ?"

# ★ అమ్మమ్మ రూపాయినోటు ★

ఇప్పటికి కథ కొంత మసకమసగ్గా అర్థమైంది, అమ్మమ్మ చాలా గ్రంథం నడిపించేసిందనీ – 'తనది' అనుకున్న రూపాయినోటు పోవడంతో విచక్షణాజ్ఞానం కూడా పోయి, నా శ్రీమతిని ఎన్నో నిష్ఠురోక్తులతో మనసు పాడుచేసేసుంటుందని. అది తెల్సుకోలేక డిటెక్టివ్ ధోరణిలో ప్రారంభించిన, పరిశోధనా ప్రభావంతో, అది పెల్లుబికి, శ్రీదేవి కన్నీరు రూపంలోనూ – మాటల 'గర్జన' రూపంగానూ బైటపడింది.

"పోనీలే అనుకోనీ, పాపం ఎక్కడుంటే భయం అక్కడుంటుంది. కావలిస్తే ఆ రూపాయి నేనే దానిమొహాన పారేస్తాలే" అన్నా కొంత ఉపశమనంగా.

"ఔనౌను ఎందుకివ్వరూ? "దొంగలాడి మొగుడిచేత యిప్పించిందమ్మా" గుట్టుచప్పుడుగా బైటపడకుండాను." అని వాళ్ళందరి దగ్గరా ఆవిడ నోరు నొక్కుకోవద్దూ మరి?"

అని గిరుున వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది. ఔను నిజమేమరి. అదిగూడా ఆలోచించాల్సిన విషయమే. పరాయింటి పిల్లయిన నా శ్రీమతిమీద యీనింద తప్పకుండా పడే అవకాశం వుంది. దూరాలోచన లేకుండా నే చెయ్యబోయే కార్యంయొక్క పరిణామ విశేషగురించి తెల్సుకున్న మరుక్షణంలోనే ఆ ప్రయత్నం విరమించుకున్నాను.

అథవా, మరో మార్గాంతరం లేనికారణంగా, ఓవేళ యీకార్యం ఆంతరంగిక వ్యక్తులవల్లనే జరిగుంటే, నాతంటాలు నేపడి, నాక్లయింటుకు, ఎవరిమీదా అపోహ కలగకుండా తనసొత్తుకు, ధక్కా లేకండా ఉంటే మరో పరిష్కారమార్గం యోచన చేసుకుందుకు నిశ్చయించుకుని, నాపని ప్రారంభించాను. ఆరిపోయిన చుట్టపీకని అవతలపారేసి, ఓసారి అమ్మనికూడా కల్సుకుని, మన లిస్టు పూర్తిచేద్దామని, కుర్చీలోంచిలేచి, వంటింటివైపుగా నడక సాగించాను.

మండుతోన్న కట్టెల సెగతగ్గిస్తూ అమ్మ బంగాళాదుంపలు వేపుడుచేస్తోంది. ఎర్రగా వేగుతూన్న ముక్కలతోబాటుగా, వేగుతూన్న ఉల్లిపాయి ముక్కల ఘుమఘుమలు నా నాసికాపుటాలని చేరి, మత్తెక్కించాయి. ఓసారి ఆవాసనని తనివితీర ఘాటుగాపీల్చి, అమ్మకు దగ్గరగా – గుమ్మంపొడిగట్టుని కూర్చున్నా. అమ్మనాకేసి ఓసారి వింతగా చూసి చిన్నగా నవ్వుకుంది. ఆనవ్వులో "నువ్వొచ్చిన పని నాకు తెలుసులే!" అన్న భావం ఉట్టిపడింది.

"అమ్మమ్మ రూపాయి నోటు పోయిందంటోంది......" అన్నా ఉపోద్ఘాతం ప్రారంభిస్తూ, అమ్మ ఒక్కసారి తల విదిలించింది.

"దాని వన్నీ వెధవ కబుర్లేరా! ఒత్తుల పెట్లో సాయంకాలం పెట్టింది; తెల్లారేసరికి ఏమైపోయింది? అనవసరంగా అందర్నీ నోటికొచ్చినట్లల్లా ఆడిపోస్తోంది. పాపం ఆగుంట (అంటే నాభార్యలెండి) కేం తెలుసు?" మీ పుట్టింటారి బడాయి మేం యెరక్కపోంలే, అంతా దొంగముండా జట్టూ -మాయముండా కబుర్లూను," అంటూ నోటికొచ్చినట్లల్లా అంది. 'ఊరుకోవే తల్లీ! పోతే పోయిందిగాని, నేనిచ్చుకుంటాలే మరో రూపాయి' అంటే ససేమిరా. వింటేనా? యేంచెయ్యనూ! వీధి వీదంతా కూడా పనిగట్టుకుని మరీ వెళ్ళి – ఇంతోటి ఖజానా కొల్లబోయిందని చెప్పిఅమ్మలక్కలందర్నీ, పిలుచుకొచ్చి, ఆ పెట్టిలోని రూపాయి కాగితం కథ ఓ సహస్ర గాయిత్రిలా పఠించింది. తిండికూడా తినలేదు. మనిషికి వయసు వచ్చినకొద్దీ – పిచ్చి ముదుర్తోంది."

"అయితే యింతకీ రూపాయినోటు పోవడం ఖాయమేనన్న మాట."

"యేమో, యేంపాడో, ఎవరికి తెలుసు? పోయిందని అంటోంది. ఉదయం ఇల్లంతా గాలించేసింది. దేవుడికి దీపం కూడా పెట్టలేదు. నానా హంగామాను. పోతే పోయిందేమో, మతి భ్రష్టుది ఎక్కడ పడేసిందోను. నిన్న సాయంకాలం దీపాలవేళ, దేవుడింట్లో బుడ్డీదీపం పెట్టడానికి నీ పెళ్ళాన్ని నే వెళ్ళమంటే వెళ్ళి దీపంపెట్టేసి మళ్ళీ వెంటనే ఒచ్చేసింది. ఆ వెళ్ళినప్పుడే, ఆ రూపాయి తీసేసుంటుందని దాని అనుమానం "నాకు తెలీదు దేవుడా" అంటూ అది యేడుపు. ఈ విడగారి శాపనార్థాలూ. ఒహోహో! ఇల్లంతా వచ్చి పోయేవాళ్ళలో ఓ తీర్థమైపోయిందంటే నమ్మబ్బాయ్!"

పోయిన రూపాయినోటు సమగ్రచరిత్రంతా తెలిసిపోయింది. ఇంట్లోని వాతావరణానికీ అమ్మమ్మ జరిపే హంగామాకీ కూడా కారణం తెలిసింది. నోటుపోవడం ఖాయమనీ – నాభార్యను అమ్మమ్మ అనుమానించడానికి కూడా తగినంత కారణం ఉందని కూడా తెల్సుకున్నాను. కానీ. నా ప్రశ్న మాత్రం ప్రశ్నగానే ఉండిపోయింది. నా భార్య సత్యసంధతని యెరుగున్న నేను ఈకారణాన్ని ఆధారంగా అనుమానించలేకపోయేను. పైగా అమ్మ సపోర్టు చాలా బలంగానే వుంది. అయినా, రూపాయి నోటు పోవడంలో ఇసుమంత అసత్యం కూడా లేదు. కాబట్టి యెవరో ఒకరు తీశారనటం మాత్రం ఖాయం. మొదట్లో యేదో సామాన్యంగా పోతుందని అనుకుని యెవరికి వారుగా "మాకు తెలీదం"టే "మాకు తెలీదు" అనేసుంటారు. తీరా యింత రాద్ధాంతం జరిగేక, దాని నివ్వటంగాని, తీశామని ఒప్పుకోవడంగాని, అమర్యాదాకరమని, ఎవరికి వారుగా ఎలిబీల కోసరం— సత్యసంధత ప్రకటించుకుందుకూ ఒకరితో ఒకరు యుద్ధం చేస్తూన్నట్లుంది. ఇంక ప్రశ్నించ వలసిన ప్రత్యేక వ్యక్తులుగానీ— ప్రశ్నలుగానీ లేక పోవడంవల్ల, చోరీప్రాంతాన్ని కూడా ఓసారి, పరీక్షించడం చాలా అవసరమని గ్రహించిన నేను, ఆధారాలని వెదుకుతూ, దేవుడి గది ప్రవేశించాను.

ఇంట్లో దీపాలు పెట్టి చాలాసేపయింది. గాని, దేవుడింట్లో మాత్రం యెవరూ ఇంకో దీపం వెలిగించకపోవడంతో గదంతా అంధకారంగావుంది. జేబులో సిగర్ లైటర్ వెలిగించి, దగ్గర్లో ఉన్న దీపంబుడ్డీ వెలిగించాను. దీపాన్ని దేవుడి పట్టు దగరగా తీసుకుపోయి, పరీక్షగా నేలంతా, పరీక్షించాను. దీపం ప్రమిదలు ప[illegible]ంగా అప్పుడే తోమిపెట్టినట్లున్నాయ్ అందులో నూని జిడ్డుగానీ, ఒత్తుల నుసిగాని కొపించలేదు. అందువల్ల ఆ దినం దేవుడిముఖం చూసినవాళ్ళే లేరని నిర్ణయించుకున్నాను. ఇత్తడిపెట్టికి దగ్గరగా దీపం తీసుకుపోయి చూశాను. పెట్టి మూత వేసే ఉంది. దేవుడి పీఠం దగ్గరా, చుట్టుపక్కలా పత్తిపోగులూ-పత్తిగింజలూ-ఒత్తులూ చెదురుగా పడున్నాయి. "బహుశా దొంగ రూపాయినోటుని పెట్టిలోనుండి చాలా హడావుడిగా తక్కువ వ్యవధిలో తప్ప

రించబోతూన్న కంగారులో, నోటుతో బాటుగా, యివికూడా బైటపడి ఉంటా” యని నిర్ధారణ చేశాను.

ఆ ఇత్తడి ఒత్తుల పెట్టెతాళంగాని; కనీసం మూతకి గొళ్ళెంకాని లేవు. పెట్టె వెనకవైపు ఉన్న బందుల్లో ఒకటి ఊడిపోవడంవల్ల మూత కొస్త తెరుచుకునే ఉండటమూ—పెట్టె మూతని చాలా సునాయాసంగా, అత్యంత స్వల్పవ్యవధిలో తెరవగలిగేందుకు అవకాశాలు ఉన్నాయి అని తెల్సుకున్నాను. చోరులు మరే యితర ఆధారాలూ తమకు సంబంధించినవి ఒదిలి వెళ్ళక పోవడం వల్ల, ఓసారి పెట్టెమూతనికూడా తెరిచి చూస్తే యేమైనా లాభించవచ్చని తలచి పెట్టెను తీయబోతూండగా చప్పున ఓ ‘ఐడియా’ తట్టింది. అదేమంటే “రూపాయి పోకముందు అది పెట్టెలో జాగ్రత్తగావుంది. అది బైటకి తీయాలంటే దొంగ పెట్టెమూతని పైకెత్తందే తనకది లభ్యం కాదు. అంటే దొంగ పెట్టెమూతని పైకెత్తాడన్నమాట. అందువల్ల అతని లేక ఆమెయొక్క వేలిముద్రలు పడితీరాలి. కాబట్టి, వాటిని సేకరించుతే కేసు మంచులా విడిపోయి, దొంగెవరైంది, తెల్సుకుందుకు అట్టే శ్రమ ఉండదు,” అని. ఆలోచన చాలా బాగానే ఉంది. “ఇంతకీ అవి సేకరించడం ఎలాగ?” అని సతమతమౌతూండగానే అమ్మ చెప్పిన మాటలు కూడా జ్ఞాపకం వచ్చి నిరాశపడిపోయేను. అమ్మమ్మ ఆ పెట్టెని కొన్ని వందలసార్లు, అందరినీ పిలుచుకొచ్చి చూపించిందనీ, రూపాయినోటు తానెలా దాచింది చూపించిందనీన్నీ, అటువంటప్పుడు ఆ పెట్టెమీద అమ్మమ్మ ముద్రలు కూడా తప్పకుండా పడే వుంటాయి. అందువల్ల యిబ్బంది అట్టే లేదుకాని, దొంగ వేలుముద్రలమీద, అనేక కోణాలలో పట్టుకుని ప్రదర్శనాలిచ్చినందున, అమ్మమ్మ వేలిముద్రలు కూడా వాటిమీదపడి డబుల్, త్రిబుల్ ప్రింట్సు అయి ఉంటే అందువల్ల అనవసర ప్రయాసా, ఫలితం శూన్యం తప్ప ఇంకేమీ ఉండదు. అందువల్ల ఆ ప్రయత్నం నుండి విరమించుకుని, పెట్టె మూతని తెరిచి చూశాను. చాలామట్టుకు పత్తి బోగలనుండి వేరుచేయబడి వుంది. ఒత్తులు ముక్కలుగా తుంచివేయబడి వున్నాయ్ – పెట్టెనిండా పత్తి గింజలూ నల్లని ఉండలూ పుంఖానుపుంఖాలుగా దొర్లించాయి. అంతతో నా పరిశోధన కూడా ముగిసింది. వివరాలన్నీ ఓ కాగితంమీద వ్రాసుకుని, ఆ రిపోర్టును ఓసారి చదువుకున్నాను.

రిపోర్టంతా ఓసారి చదువుకున్నాక, ఎక్కడో నా పరిశీలనలో యేదో లోపం ఉన్నట్లు, అది తెల్సుకోవడం చాలా ముఖ్యమనికూడా తట్టింది. వెంటనే లేచి అమ్మమ్మ ఉన్న వసారావేపుగా వెళ్లాను. అమ్మా—నా భార్య—అమ్మమ్మ ఒక్కొక్కరు ఒక్కొక్క వైపుగా తిరిగి కూర్చుని ఉన్నారు. ఒకరితో ఒకరు మాట్లాడుకోవడంలేదు. ఎవరికి వారుగా యేమో దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చున్నారు. ఆత్రుతగా నే రావడం చూసిన అమ్మమ్మ ఆశగా నావైపు ముఖం తిప్పిచూసింది. ఆ చూపులో ‘నా రూపాయి నోటు దొరికిందా?’ అన్న ఆశాభావం వ్యక్తమయింది.

“అమ్మమ్మా! ఆ రూపాయినోటు నెంబరు గాని నీకు తెల్సా?” అన్నా ఆత్రుతగా.

“నీ మొహంలాగే ఉంది నీ ప్రశ్న. అష్టపదులు వల్లెవేసుకోడం రానిదానికి ఆ నోటులో నెంబరే ఉందో—నా శార్థమే ఉందో నాకేం తెల్సురా?” అంది.

నా అమోఘమయిన డిటెక్షనుకు అమ్మా—నా శ్రీమతి ఒక్కసారిగా ఫక్కున నవ్వేరు. అమ్మమ్మ నా మొహంగురించి చేసిన విమర్శనకంటే వీళ్లనవ్వు నన్నెంతగానో బాధపెట్టింది. నా తల కొట్టేసినంతపనయింది. పుస్తకాల్లో, అనేక క్లిష్టపరిస్థితులు సృష్టించి అత్యంత నైపుణ్యంగా అవసర వాతావరణ సృష్టితో హంతకులని డిటెక్టివ్ చేత పట్టించే నా నేర్పూ—కథా కల్పనా సామర్థ్యం, యీనాడు డిటెక్టివ్ స్థానంలో నిల్చుని, ఇంట్లో పోయిన అమ్మమ్మ రూపాయినోటు విషయం తెల్సుకు నేందుకు నే పడుతూన్న అవస్థలు—గురవుతూన్న అవమానాలకీ లెక్క లేకుండా పోయింది. ఇంతయినా కేసు స్వరూపం పిసరంత కూడా ఆచూకీ దొరక్క పోవడం రెండోది. నా పుస్తకాలలో జయం ఎప్పుడూ డిటెక్టివ్‌దే. అయినా యింత ఖంగారు యే డిటెక్టివ్‌నీ కూడా పడనియ్యలేదు. పుస్తకాల్లో సృష్టించినంత సులువుగా—రమ్యంగా—దైనందిన వ్యవహారాలలోని విషయాలు నిగ్రహించుకుంవడం సామాన్యం కాదన్న నగ్న సత్యం యీనాడు నాకు అవగతమయింది. ‘అదే సత్యం’ అంటూ ఎవరో వెయ్యి గొంతులతో నా హృదయాంతరాళాల్లోనుండి అరుస్తున్నట్లుంది. నాలో పట్టుదల ఎక్కువయింది. ఆ అవమానాలని నిగ్రహించుకుని, అమ్మవైపు తిరిగి:

“ఉదయం దేవుడింటిలో దీపం ఎవరు పెట్టేరు?” అనడిగాను.

“నేనేరా?”

# ★ అమ్మమ్మ రూపాయినోటు ★

"దీపం' పెట్టలేదన్నావ్ యిందాకడిగి నప్పుడు?" అన్నా ఆశ్చర్యంగా యేదో మర్మం గ్రహించినట్టుగా పోజుపెట్టి.

"ఎవరన్నార్రా? అమ్మమ్మ పెట్టడం లేదన్నాను. అందువల్లే ఆనక స్నానంచేసి నేనే పూజ చేశాను."

నాతల తిరిగిపోయినంత పనయింది. అనుమానం నా భార్యమీదా-అమ్మమీదాకూడా బలపడుతోంది. గాని, పొరబాటు నేనా ఆవిషయంగాని బైటకన్నానో కొంప అమాంతంగా అంటుకుంటుంది. రెండో ఆట సినీమా కెళ్తానని చెప్పి ఎనిమిదింటికల్లా భోజనం ముగించుకొని బజారుకేసి నడక సాగించాను.

* * *

రాత్రి 9 గం॥ లకు ఇల్లు చేరుకున్నాను. ఇంట్లో బెడ్‌రూంలైటు మసక మసగ్గా వెలుగుతోంది. తలుపులకి లోనగడియలు వేయక పోవడంవల్ల, తలుపు తోయగానే తెరుచుకున్నాయి. ఇంట్లో అందరూ ఎవరిగదుల్లో వారు నిద్రపోతున్నారు. అమ్మమ్మకూడా తన మామూల్లుస్థలం. అంటే దేవుడి గదిముందు వసారాలో కాకుండా, యింటి నడవలో పక్కేసుకుంది. చప్పుడు కాకుండా దేవుడి గదిలో ప్రవేశించి, తలుపులు దగ్గరగా చేరవేసి, ఓసారి ఒత్తులపెట్టె మూత తెరిచి అందులో ఉన్న రూపాయి కాగితం చూసి తృప్తిగా, మళ్ళీ మూత ఎప్పట్లా వేసేసి, ఓ మూలగా వచ్చి కూర్చున్నాను.

నా అంచనా ప్రకారం, ఇంట్లోవారి "చేతిసాపు" వ్యవహారమే అయుంటే, తప్పకుండా ఆ రూపాయి నోటుని తిరిగి పెట్టేసేందుకుగాని - లేదా అమ్మమ్మ ద్వారానే తిరిగి అదే పెట్టిలో దాచిన యీ రూపాయిని కూడా తస్కరించేందుకు గాని తప్పకుండా ఒస్తారనే. అందుకనే ఎటువంటి ఆటంకాలూ కలగకుండా ఉండేదుకుగాను,అమ్మమ్మకి చాలా దూరం నచ్చచెప్పి, దొంగయెవరైందీ తెల్సుకుందుకుగాను సరంజామా అంతా జాగర్త పరచుకుని, ఓమూల ఒదిగి కూర్చున్నాను. తాలూకాఫీసులో కొట్టిన పన్నెండు గంటలూ లెక్కపెట్టేను. దొంగలు వచ్చిన జాడలేదు. ఇంతలో మూసివున్న తలుపు మీద బరబరా గీసిన చప్పుడయింది. కాస్త దగ్గరగా వెళ్ళి చూశాను ఆ చీకట్లో యే ఆకారమూ ఔపించటంలేదు. గాని, ఆశబ్దం మాత్రం ఆగిపోయింది. ఆ చీకట్లో బొద్దింకలూ-ఇంకా ఏవేవో కీటక సమూహాలు తమ చిత్తం వచ్చినట్లుగా తాండవ నృత్యం చేయసాగాయి. ఒంటిగంటకూడా అయింది దొంగల జాడలేదు. చిరాకు ఎక్కువ కావడం మొదలెట్టింది. నిద్దర ముంచుకొస్తోంది. టీగాని - సిగరెట్టుముక్కయినా కాల్చుకునేందుకు అవకాశం లేకపోవడం వల్లా దొంగల అతీగతీ తెలీక పోవడంవల్లనూ నిద్రతో కుస్తీపడుతూ, ఎల్లాగో అంత వరకూ బ్రహ్మప్రయత్నం మీద మేలుకుని కూర్చోగలిగాను. నా కళ్ళు వాటంతటవే మూసుకుపోసాగాయి. మన ప్రయత్నం వృధాకాజొచ్చింది. ఉన్నట్టుండి పెట్టె మూత "టపటపా" కొట్టుకోవడం ప్రారంభించింది. అంతతో ఒక్క ఉలికిపాటుతో కళ్ళు తెరుచుకుని గదంతా కలయ జూశాను.

[illegible] తలుపులు మాత్రం యధావిధిగా ఎప్పట్లా వేసే ఉన్నాయ్. ఎందుకయినా మంచిదని ఓసారి పేంటు జేబులోని చిన్న టార్చి-రాత్రి బజార్లో కొనుక్కొచ్చుకున్న ఆటోమెటిక్ పిస్టల్ బైటకు తీసిపట్టుకున్నా ఆత్మరక్షణకి. నా అలిడికి చప్పుడు ఆగిపోయి, మరోనిమిషంలో మళ్ళీ "టపటపా" అంటూ పెట్టె మూత కదలసాగింది. ఏ ప్రమాణంలోనూ మానవాకారంలాంటిదేదీ కనుపించక పోవడంతో, దెయ్యమేమో నన్న తలంపు రావడం యేమిటి, ఒళ్లంతా చెమట పట్టడం యేమిటి, అన్నీ నిమిషంలో జరిగిపోయాయి. అందువల్ల ముందు నే ననుకున్న విధానానికి కాస్త విరుద్ధంగా, 'ఆగు' అన్న పొలికేకతో, టార్చిస్విచ్‌కి బదులుగా పిస్టల్‌ని నొక్కేయడం. అది బ్రహ్మాండంగా "ఢాం!" అని పేలడంతో, ఇంట్లోవారితోబాటుగా ఇరుగు పొరుగువాళ్లు యావన్మందీ మా యింట్లో చేరడముతో, నా గదిముందో పెద్ద గుంపు తయారయింది. నా పొరబాటు గుర్తించి, యీలోగా నా టార్చిలైటు స్విచ్ నొక్కేశాను. బేటరీలైటు కాంతిలో ద్వారానికి అడ్డంగా నిల్చునుంది అమ్మమ్మ. ఎవర్నీ లోపలకు రానియ్యకుండా ఆపుతోంది.

టార్చిలైటు కాంతిలో, రెండు చిట్టెలుకలు దేవుడిపట్టుమీద నిల్చుని బెదురు చూపులు చూస్తూ ఉండిపోయాయి. వాటి నోట్లో నా రూపాయికాగితం నలుగుతోంది. ఈ దృశ్యం చూశాక, ధైర్యంగా ముందుకు అడుగువేశాను. రూపాయికాగితం వదిలి బెదిరి దేవుడి సింహాసనంక్రింద దూరి అదృశ్యమయాయి.

అమ్మమ్మ "మైలబట్టలుతో తేనా యేవిట్రా?" అంటూ అరుస్తూన్నా వినిపించుకోకుండా దేవుడి సింహాసనం దించి, దానికింద చెత్తా చెదారం-పత్తిబోగలూ ఓ ప్రక్కకినెట్టి, అక్కడి కన్నంలోకి నా పెన్సిల్ పోనిచ్చి కెలికాను. రెండుకాసలూ చిరిగిన అమ్మమ్మ కొత్తనోటు గర్వంగా బైటకిలాగి, అమ్మమ్మమొహాన గిరాటేసి నా గదివైపు నడిచాను విజయగర్వంతో.

జరిగిన సంగతంతా తెల్సుకున్న అమ్మ అమ్మమ్మ మొహం వాచేటట్లుగా చీవాట్లేసింది. అమ్మమ్మ మొహం మాడినా— పోయిందనుకున్న తనరూపాయి తిరిగీ లభించినందుకు-ఆ మొహంలో ఓ విధమయిన కళాకాంతీకూడా ప్రస్ఫుటంగా ప్రదర్శితమయాయి.

మిగిలిన రాత్రంతా నిద్రపట్టని కారణంగా, మర్నాడు ఆఫీసుకు శెలవు పెట్టి, మధ్యాహ్నం భోజనం కాగానే సుష్టుగా నిద్రపోయాను, గతరాత్రి నా పరిశోధన ఫలితాలని తలచుకుంటూ. ★

# పతిత జనోద్ధరణం

## ప్రాచీన గాథాలహరి

**పి. గణపతిశాస్త్రి**

గత సంచిక తరవాయి

౪

అటుపిమ్మట క్రమంగా ఒక పక్షం రోజులు గడిచిపోయాయి. అయినా రాగమంజరి తల్లి మరి ఆశ్రమానికి తిరిగి రాలేదు.

ఆమె తిరిగి రాకపోవడంతో ఆరుణి హృదయంలో కొంచెం ఆందోళన బయలుదేరింది. ఆ తరవాతనైనా ఆమె ఎప్పుడో ఒక్కప్పుడు హఠాత్తుగా ఆశ్రమంలో విరుచుకు పడగలదనీ, రాగమంజరి నెలాగైనా తిరిగి పంపించ వలసిందని మళ్లీ కాళ్లావేళ్లా పడి గగ్గోలు చెయ్యగలదనీ అతడు భయపడ్డాడు.

ఆ దృష్టితోనే ఒకనాడు రాగమంజరిని తిరిగి చంపానగరానికి వెళ్లి పోవలసిందని బలవంతం చేశాడు: కాని ఆమె చెక్కిళ్ళపై జాలువారిన కన్నీరు పరిశీలించగానే అతనికి కొంచెం జాలివేసింది. ఆమె నంతగా బలవంతం చేసినందుకు లోలోపల బాగానొచ్చుకున్నాడు.

సంసారం పై విరక్తితో ఒక పతిత స్త్రీ అతని పాదాలాశ్రయించింది. గడిచిన పక్షం రోజుల నించీ ఆరుణి ఆమె ప్రవర్తన చాలా నిశితంగా పరిశీలించాడు. ఆ ప్రవర్తనలో అతని కెక్కడా వేలెత్తి చూపడానికి కాస్కారం కనిపించ లేదు. బాగా పసివారైనా అతని శిష్యుల నెన్నడు ఆమె కన్నెత్తి పలకరించనే లేదు. ఆశ్రమానికి వచ్చినప్పు డామె శరీరం మీద కొన్ని చిన్న చిన్న అలంకారాలుండేవి. ఇప్పు డామె ఆ అలంకారాలన్నీ పూర్తిగా విసర్జించి వేసింది. కేవలం పట్టె నార చీరలతో సన్న్యాసినీ వేషం ధరించింది. ఎంతటి ఎముకలు కొరికివేసే చలిలోనైనా తన దైనందిన నియమాలు, జపతపాలు, విసర్జించ లేదు. ఆమె నిష్ఠచూచి శిష్యులెంతో ఆశ్చర్యపడ్డారు. క్రమక్రమంగా ఆరుణికి కూడా ఆమె నిష్ఠయెడల గౌరవం కలిగింది.

ఆ విధంగా అత్యంత శ్రద్ధాభక్తులతో తన పాదాలాశ్రయించిన ఒక పతితస్త్రీని ఆ విధంగా తిరిగీ సంసారం కూపంలోనికి తోసి వెయ్యడం కేవలం పాప హేతువు కాగలదని అతనికొక్షణంలో స్ఫురించింది.

చంపానగర వాసులు కొందరప్పుడప్పు డతనిని సందర్శించి పోయేవారు. అతడు వారి వారి అర్హతల ననుసరించి ధర్మోపదేశాదులు చేస్తూండేవాడు.

అయితే ఇప్పుడతని కొక విషయంలో ఒక పెద్ద ఆశంక పట్టుకుని పీడించింది. ఇంతకు పూర్వం చంపానగర మహిళలతనిని సందర్శించక పోలేదు. ఆరుణి వారికి కేవేవో ధర్మోపదేశాలు చేసేవాడు. వారొకటి రెండు రోజులాశ్రమంలో ఉండి తిరిగి చంపానగరానికి వెళ్ళిపోయేవారు.

కాని రాగమంజరి ఆజన్మాంతము ఆశ్రమవాసం చెయ్యాలని నిశ్చయించింది. తనకు మంత్రోపదేశం చెయ్యవలసినదని ప్రార్థించింది. ఆవిధంగా ఆమెకాజన్మాంత దీక్ష ఇచ్చి మంత్రోపదేశం చెయ్యడం సముచితమేనా అని అతనికొక పెద్దసందేహం బయలు దేరింది.

అతనిమనస్సులో ఇంకొ అనుమానంకూడా బయలుదేరింది. ఇన్నాళ్లనించీ అతడామె యౌవనసౌందర్యాగులంత శ్రద్ధగా పరిశీలించలేదు. ఇటీవల ఆమె యౌవన సౌందర్యాలు జాగ్రత్తగా పరిశీలించాడు. ఆమెకింకా పాతికసంవత్సరాలైనా నిండలేదు. పరిపూర్ణ యౌవనం ఆమె ఆకృతిలో అంతటా పరిస్ఫుటంగా స్ఫురించింది. రాగమంజరి అంతటి మహాసౌందర్యవతి కాకపోవచ్చును గాని మొత్తంమీద ఆమె అందగత్తెలలో లెక్కే.

ఆమె యౌవనసౌందర్యాలు కొంచెం నిశితంగా పరిశీలించగానే ఆరుణికి తన శిష్యులిద్దరివిషయము హఠాత్తుగా స్ఫురించింది. వారిద్దరు వటువులే. వారిలో ఒకడింకా పసివాడే. అతనికింకా పదిపదహారేళ్లయినా నిండాయో లేదో! రెండవశిష్యునికి పద్దెనిమిదేళ్లు నిండాయి. ఆపరిస్థితులలో వారికి స్త్రీసన్నికర్ష అంతగా సముచితం కాదేమో నని అతనికి భయం వేసింది.

ఆరుణికి తన విషయంలో అవిధమైనసందేహానికావస్కారం లేనేలేదని అనిపించింది. అతని కిప్పుడు ఏబైయోపడి దాటిపోవచ్చింది. పైగా అనేకమైన అసిధారావ్రతాలలో ఆరితేరిన అతనికిది ఒకప్రశ్నగానే స్ఫురించలేదు. ఎంతసేపు అతనికా శిష్యుల విషయమే ఒక విషమసంధిలా స్ఫురించింది. అయితే అలాగ ఎన్నాళ్లాలోచించినా అతనికేమి చెయ్యడానికీ మనస్సొప్ప లేదు.

ఒకనాటి ప్రాతఃకాలవేళ అతడు తన జపతపాదులు ముగించుకుని తన కుటీరానికెదురుగా ఆర వేసిన నారచీరలతీరుపరిశీలిస్తూ కూర్చున్నాడు.

అవి పవిత్ర భాగీరథీ జలాలలో పరిశుభ్రంగా స్వచ్ఛంగా ఉతికి ఆర వేసిన మడుగుదోవతులు. గంగానదీ సైకతాలలో మెరిసిపోయే తెల్లని రెల్లుపూరేకల్లా ఉదికి ఆరవేసిన ఆమడుగు దోవతులమీద శిశిర ప్రాతఃకాల సూర్యకాంతి ప్రసరించగానే అతని దృష్టికవి కేవలం కాషాయవస్త్రాలలా ప్రత్యక్షమైనాయి.

ఆ సమయంలో హఠాత్తుగా అతనికొక అభిప్రాయం స్ఫురించింది.

ఎంతటి తెల్లని మడుగు దోవతి అయినా ఎర్ర ఎర్రని లేత ఎండపడగానే అది కాషాయవస్త్రంలా మారిపోయింది. హృదయంకూడా ఎంతస్వచ్ఛమైనా స్త్రీసాంగత్యంలో అది ఇట్టే రాగరంజితమై పోగలదని అతనికి భయం వేసింది. ఆ సమయంలో శిష్యులకిక స్త్రీసాంగత్యం క్షేమదాయకం కాదని ఒక నిశ్చితాభిప్రాయం కలిగింది. కాని వెంటనే రాగమంజరి నాశ్రమం నించిపంపించి వే[illegible]డానికి మనసొప్ప లేదు. అలాగని ఆమె [illegible]మంలో ఉండనీయడానికీ మనసొప్ప లేదు.

ఎప్పుడైనా తపశ్చర్యను గురించిన ధర్మసందేహాలు కలిగినప్పుడు మరీచిమహర్షిసన్నిధిలో ఆ ధర్మసందేహాలు తీర్చుకోవడం అతనికొక పరిపాటి. మరీచిమహర్షి అతనికి సన్న్యాసాశ్రమదీక్ష ఇచ్చిన మహామహుడు. మహాతపశ్శాలి.

ఆరుణి ఆ విషయంలో మరీచి మహర్షినొకమారు సందర్శించవలెనని అనుకొన్నాడు. శిష్యులిద్దరినీ ఆశ్రమ సంరక్షణ కప్పగించి ఆ మరునాడే మరీచిమహర్షి ఆశ్రమానికి బయలుదేరి వెళ్ళిపోయాడు.

# ★ పతిత జనోద్ధరణం ★

౫

పది పదిహేను క్రోశాలదూరం నడిచి మరీచిమహర్షి ఆశ్రమం చేరుకోగానే ఆరుణి ముని హృదయంలో ఒక విధమైన ప్రశాంత స్థితి ఏర్పడింది. ఆ ఆశ్రమ వటవృక్ష చ్ఛాయలో మరీచిమహర్షికి సాగిలిపడి అతని సన్నిధిని కూర్చోగానే ఆరుణికి తిరిగీ ఇంకొక వటవృక్ష చ్ఛాయలో కూర్చున్నట్టు తోచింది. అతని హృదయంలోని సంశయాలన్నీ ఒక్కమారుగా విచ్ఛిన్నమైనట్టుగా ఒక అపూర్వానుభూతికలిగింది.

దట్టంగా అల్లిబిల్లిగా అల్లుకొన్న ఆశ్రమ వృక్షాల గుబురులలో కొంచెం మున్ముందుగానే సూర్యాస్తమయం అయినట్టు కనబడింది. మరీచి మహర్షి ఆశ్రమంలోని ఉడతలు, పిచుకలు మొదలైన జీవాలు మహర్షికి దగ్గరగానే ఎంతో చనువుగా సంచరిస్తూ ఆడుకొంటున్నాయి. ఆరుణి మరీచికి సాష్టాంగ నమస్కారంచేసి కూర్చోగానే ఆ జీవాలతన్ని చూచి కొంచెం బెదిరి దూరంగా పారిపోయాయి. ఒక లేడికొంచెం దూరంలో నిలబడి నిశ్చలంగా అతనివైపు చూచింది. మరీచి మహర్షి తన కెదురుగా కూర్చున్న వృద్ధతాపసుల కిద్దరికి ధర్మోపదేశం చేస్తున్నాడు. ఆరుణిని చూచినా అతడా ధర్మోపదేశం విరమించలేదు:

"మీరెన్నడయినా వానర వినోదుల రణ్యాలలో కోతులను పట్టుకొనే తీరులు పరిశీలించారా?"

ఆ ఇద్దరు వృద్ధులు ఆ విషయం ఎన్నడు పరిశీలించనే లేదన్నట్లాశ్చర్యంగా మహర్షి వైపు చూచారు. మహర్షి మళ్ళీ తన ప్రసంగం ప్రారంభించాడు:

"నేనది అంతా వివరిస్తున్నాను. శ్రద్ధగా ఆలకించండి! వానర వినోదులు కోతులు తిరిగే చోట భూమిలో చిన్నచిన్న మూతులున్న కలశాలు స్థాపిస్తారు. ఆకలశాలలో కోతుల కిష్టమైన కాయలు పడవేసి దూరంగా తొలగిపోతారు. కోతులా కాయలు కోసం ఆకలశాలలో చేతులు పెట్టి అవి గట్టిగా పట్టుకొని పైకి తీయాలని ప్రయత్నిస్తాయి. కాని ఆ కాయ లిరికించుకొన్న కోతుల పిడికిళ్ళు బాగా పెద్దవై పోతాయి. అవి ఎంత గిలగిలా కొట్టుకున్నా ఆ కలశాలలో చిక్కుకొన్న పిడికిళ్లు పైకిరావు."

ఆ వృత్తాంతం అత్యంత శ్రద్ధగా విని ఆరుణి ఎంతో ఆత్రంగా ప్రశ్నించాడు:

"ఆ కాయలా కలశాలలోనే విడిచివేస్తే పిడికిళ్లు సులభంగా పైకి తీసుకోవచ్చును గదా?"

"నిజమే! కోతులకా జ్ఞానం కలగదు. అవి ఆ కాయలలాగే పట్టుకుని అతిదీనంగా ఆక్రోశించి ఆక్రోశించి అలిసిపోతాయి. ఆ సమయంలో వానర వినోదులు వాటిని పట్టుకొని బాగా మచ్చిక చేస్తారు."

మరీచిమహర్షి ఆ విషయం ప్రసంగించడానికి కారణమేమో ఆరుణికి తెలియలేదు. అతడలాగే ఆశ్చర్యపోతూ మహర్షి కేసి చూచాడు. మహర్షి మళ్ళీ తన ప్రసంగం ప్రారంభించాడు:

"ఈ సంసార తాపత్రయాల్లో చిక్కుకొన్న దౌర్భాగ్యులు కూడా అలాంటివారే. అలభ్యమైనఫలాలకోసం ఆ కోతులధోరణిలో అంగలారుస్తూ అలాగే అలిసిపోయి మృత్యు దంష్ట్రిలలో చిక్కుకొంటారు. అంతేగాని ఆ అలభ్యమైన ఆ ఫలాకాంక్షలు విడిచిపెట్టాలని వారికి తెలియదు. ఎంత చెప్పినా వినిపించుకోరు."

ఆ కథ విన్న తరవాత అక్కడ కూర్చున్న వృద్ధతాపసు లిద్దరు నిట్టూర్చి మహర్షి పాదాలకు నమస్కరించి నెమ్మదిగా అక్కడినించి వెళ్ళిపోయారు.

ఆరుణికా కథ వినగానే నిత్యము తాపత్రయాలలో తలమునకలైపోతూ క్రమంగా మృత్యుదంష్ట్రిలలో పడిపోయే సంసారుల యెడల విపరీతమైన జాలికలిగింది. వారి యమయాతన లొక్కమారు తలుచుకోగానే అతనికి కళ్లు కొంచెం చెమ్మగిల్లాయి. ఆ క్షణంలో తన తపశ్చర్యలన్నీ నిలిపివేసి నిత్యదుఃఖితులైన పతిత జనుల సముద్ధరణంలో జీవిత శేషం అంతా గడిపెవెయ్యాలని అనిపించింది. అయినా కొంచెం అడకువలో మహర్షికి విన్నవించుకొన్నాడు:

"నాకీ నిత్యదుఃఖితులైన జీవుల యాతనలు తలచుకొన్న కొద్దీ ఇక ఈ తపశ్చర్య ఇంతటితో విరమించివేసి పరమేశ్వ స్వరూపులైన పతితజనుల పరిరక్షణలోనే జీవితశేషం యావత్తు గడిపివెయ్యవలెననే ఉత్కంఠ కలుగుతున్నది."

అని అలాగే రెప్పవాల్చకుండా మహర్షి ముఖం చూస్తూ కూర్చున్నాడు. ఆ మాటతో మహర్షి నుదుటిపై రూక్షంగా బొమముడి విరిగింది. అతడు దురుసుగా ఆరుణిమీద విరుచుకుపడ్డాడు.

"ఈ సముద్ధరణాధికారం నీ కెవరిచ్చారు? ప్రపంచం అంతా సృజించిన ఆ పరమేశ్వరుడే వారి సంరక్షణభారం గ్రహించగలడు. మధ్యన అల్పాల్పుడవు, అ[illegible] అయిన నీ వెవరవు?"

ఆరుణి ఆ మాటవిని తలవంచు[illegible]న్నాడు. అతని కొక నిమిషంవరకు ఏమనడానికీ పాలుపోలేదు. అలాగే తలవంచుకొని వినబడీ వినబడనట్లుగా నెమ్మదిగా నసిగాడు.

"అయితే నిత్యదుఃఖితులైన జీవులాక్రోశిస్తూంటే మనం అంతా తటస్థంగా మాట్లాడకూరుకోవడం ధర్మమేనా?"

మరీచిమహర్షి ముఖం ఆ ప్రశ్నతో మరింత జేవురించింది:

"మున్ముందు నీ ఆత్మసముద్ధరణ విషయం ఆలోచించుకో! అది జరిగిన తరవాత పతిత జనోద్ధరణ విషయం ఆలోచించుకోవచ్చులే!"

ఆరుణి అంతటితో మాట్లాడ కూరుకోలేదు:

"అయితే అంతవరకు తటస్థంగా మాట్లాడ కూరుకోవలిసిందేనా?"

అది కేవలం స్వార్థదృష్టికాదా?

" మహర్షిముఖంలో తీవ్రత కొంచెం [illegible]లింది:

"అహంకారావేశం అణిగిపోనంతవరకు ఈ స్వార్థపరార్థాల నిర్ణయం మిక్కిలి దుష్కరం! అందుచేత మున్ముందుగా సాధించుకోవలిసింది రాగాద్వేషాదిదమనం!"

అయినా ఆరుణి సందేహం అంతమాత్రంచేత తీరలేదు. అసలీ శంకలన్నీ అతని హృదయంలో రాగమంజరిని గురించే బయలుదేరాయి. ఇక ఆ విషయం విస్పష్టంగా చెప్పకపోవడం మంచిదికాదని అతడు నిశ్చయించుకొన్నాడు. సంగ్రహంగా మరీచి మహర్షికి రాగమంజరి విషాదగాథ అంతా తెలియజేశాడు. ఇక మహర్షి ఏవిధంగా ఆజ్ఞాపిస్తే ఆవిధంగానే చెయ్యవలెనని నిశ్చయించుకొన్నాడు. కాని మరీచి మహర్షి ఆ ప్రశ్నకంత విస్పష్టంగా ప్రత్యుత్తరమీయలేదు. ఆరుణి అత్యంతవినయంగా ప్రార్థించిన పిమ్మట చిట్టచివర కొక నిట్టూర్పు విడిచిపెట్టాడు:

"ఆరుణీ! ఈవిషయం నేనేమినిర్ణయించ



మున్ముందు నీ ఆత్మ సముద్ధరణ విషయం ఆలోచించుకో!

గలను. ఇంతకీ ఆమె అర్హత ఎట్టిదో నే నెరగను కదా! ఆమెకు సహజవిరక్తి కలిగి నపుడు ధర్మదీక్ష ఇవ్వవచ్చును. అసలు మున్ముందుగా నీ వలవరుచుకోవలిసినది రాగద్వేష రాహిత్యం. అది సిద్ధించినపు డిలాంటి వెన్ని చేసినా అవి నిన్నంట జాలవు."

ఆపైన ఆరుణి ఇక ఏమని ప్రశ్నించగలడు! కొంచెం జిజ్ఞాసాదృష్టితో మళ్లీ ఏదో ప్రశ్నించబోయాడు. అంతలోనే మహర్షి అక్కడినించి కదిలి వెళ్లిపోయాడు. ఆరుణి అతని అడుగుల్లో అడుగులు వేసుకుంటూ వెనువెంటనే నడిచి వెళ్లిపోయాడు. మహర్షి మళ్లీ నిశితంగా ఆరుణిముఖం పరిశీలించాడు:

"ఆ పరమేశ్వరునిసంకల్పం ఎలాగున్నదో సరీగా · ఆవిధంగానే జరిగిపోతుంది. నీకీ అనవసరమైన ఆందోళన ఎందుకు?" యద్భావి తద్భవతి!"

అయినా అతని హృదయంలో ఆందోళన మందగించలేదు.

౬

ఆరుణి తిరిగి తన ఆశ్రమానికి చేరుకొన్నాడు. అతడు తిరిగి వచ్చేసరి కించుమించుగా పదిరోజులు పట్టింది.

శిష్యులు, రాగమంజరి ఆరుణి రాకకోసం ఎదురు తెన్నులు చూస్తున్నారు. ఆరుణిని చూడగానే వారందరి ముఖాలు ఒక్కమారుగా వికసించాయి.

ఆ పది రోజులలోను ఆశ్రమంలో కొన్ని కొత్త మార్పులు వచ్చాయి. ఇంతకు పూర్వం శిష్యు లిద్దరు అడవికి వెళ్ళి ఆరుణికి కావలిసిన సమిధలు, కుశలు, ఫలాలు, పుష్పాలు మొదలైనవి తీసుకు వచ్చేవారు.

కాని ఈ మధ్యన రాగమంజరి ఆశ్రమానికనతిదూరంలో కొన్ని పూల మొక్కలు నాటింది. వాటికి పాదులు చేసింది. పొద్దస్తమానము వాటికి నీరుపోసి పెంచడంలోనే నిమగ్నురాలైపోయింది. మిగిలిన కాలంలో ఆమె జపతపాదులలో మునిగి పోయేది. ఇంతేగాక తన కుటీరమేగాక ఆరుణి కుటీరము, శిష్యుల కుటీరము పరిశుభ్రంగా అలికి ముగ్గులు పెట్టేది.

శిష్యుల నామె కన్నతల్లికన్నా ఎక్కువ ఆప్యాయంగా ఆదరించింది.

వారి కామె యెడల కలిగిన మాతృగౌరవ భావం పరిశీలించిన ఆరుణి కాక్షణంలో ఆవిషయంలో అంతకుపూర్వం కలిగిన భయ సందేహాలన్నీ తొలగిపోయాయి.

క్రమంగా ఆశ్రమంలో శిశిరర్తు వుచిహ్నాలన్నీ అంతరించిపోయాయి. నూతన వసంత ప్రాదుర్భావంతో రాగమంజరి పాదులుచేసి నీరుపోసి పెంచిన పూల మొక్కలన్నీ చిగిర్చి మొగ్గలు దొడిగాయి. అంతేకాదు. ఆ పరి

# ★ పతితజనోద్ధరణం ★

వనారణ్యం అంతా నవవసంత ప్రాదుర్భావంతో ఒక వినూతన స్వరూపం ధరించింది.

ఒకనాటి ఉదయం రాగమంజరి కన్నతల్లిలా కొత్తగా పూచిన పూలకేసి చూస్తూ ఎంతో అమాయికంగా కనిపించింది.

ఆమె అమాయికానందం చూడగానే ఆరుణికింతకుపూర్వం ఆమెపై కలిగిన అనుమానాలన్నీ మంచువిడిపోయినట్లు విడిపోయాయి.

'ఈమెమూలంగా నాశిష్యుల వేదాధ్యయనాదులకు, జపతపాదులకు అంతరాయమేదైనా కలగవచ్చునని ఎంతైనా అనుమానించాను. ఆ అనుమానాలన్నీ నా హృదయదౌర్బల్యంవల్లనే ఏర్పడ్డాయి. సందేహమేమీ లేదు.'

ఆ ఆరుణి తన హృదయ దౌర్బల్యానికి కొంచె[illegible]పడ్డాడు.

అయి[illegible]డంతవరకు ఆమెకు పూర్తిగా సన్యాసదీక్ష ఇవ్వనే లేదు.

మరీచిమహర్షి చెప్పినట్లు ఆమె అర్హతానర్హతలు పూర్తిగా పరిశీలించిన తరవాతే ఆమెకా సన్యాసదీక్ష ఇవ్వడం సముచితమని అనుకొన్నాడు.

అయినా మరీచిచేసిన హెచ్చరికలతని హృదయంలో ఛండీ జీవాలయ ఘంటలలా మారుమోగడం మొదలుపెట్టాయి. మరీచి మహర్షి ముందుగా చిత్తశుద్ధి, రాగద్వేష రాహిత్యము అలవరుచుకోవలసిందని నొక్కి నొక్కి చెప్పాడు. అహంకారావేశం అణిగిపోనంతవరకు ధర్మాధర్మ నిర్ణయం చాలా క్లిష్టమని ఆదేశించాడు. ఎన్నిమారులు నొక్కి నొక్కి అడిగినా రాగమంజరికి ధర్మదీక్ష ఇవ్వవచ్చునని కాని, ఇవ్వకూడదనిగాని నిష్కర్షగా తేల్చి చెప్పలేదు. ఆరుణి అంతటితో విడిచిపెట్టలేదు. ఇంకా నొక్కి నొక్కి అడిగాడు. అయినా మహర్షి ఆ విషయం తేల్చి చెప్పలేదు. పరమేశ్వర సంకల్పం ఏవిధంగా ఉంటే ఆ విధంగానే సర్వము జరిగిపోగలదని అన్నాడు. ఆ విషయంలో ఆందోళన పడడం అనవసరమని చెప్పి ఆ ప్రస్తావన అంతటితో ముగించివేశాడు.

ఆరుణికి మహర్షి ఆ విషయంలో ఇచ్చిన ఉపదేశం అంతగా రుచించలేదు. ఒకవ్యక్తి తనకు రాగద్వేష రాహిత్యం సిద్ధించేవరకు నిత్యదుఃఖితులైన జీవుల యమయాతనలన్నీ తటస్థంగా తనకు పట్టనట్టుగా చూస్తూ ఊరుకోవలసిందేనా?

అదీగాక ఒకవ్యక్తి తన కాత్మపరిశుద్ధి కలిగినదో లేదో నిర్ణయించుకోవడమెలాగ?

ఆరుణికి తన చిత్తశుద్ధి విషయంలో ఎన్నడు అణువంతైనా సందేహం కలగలేదు. పైగా పరమేశ్వర స్వరూపులైన పతితజీవుల సముద్ధరణమే తన ముఖ్యధర్మమనీ ఆ ధర్మ నిర్వహణలో వెనకంజ వెయ్యడం మహాపాతకహేతువు కాగలదనీ అనుకొన్నాడు.

అయినా అతడు రాగమంజరికి పరిపూర్ణ ధర్మదీక్ష ఇవ్వడంలో తొందర పడలేదు.

రాగమంజరికూడా ఆ విషయంలో అతనినేమీ బలవంతం చెయ్యలేదు. అన్ని విషయాలలోను అతని ఆజ్ఞప్రకారమే ప్రవర్తించింది. అతనే తనకిక శరణ్యమని నమ్మింది.

ఆలాగలాగ వసంతం గడిచిపోయింది. క్రమక్రమంగా గ్రీష్మం కూడా గడిచి[illegible]. ప్రచండ గ్రీష్మంలోకూడా జ[illegible]దులలో రాగమంజరి భక్తిశ్రద్ధలు పరిశీలించిన ఆరుణికిక ఆమెను పరీక్షించడం కేవలం అన్యాయమే అని తోచింది.

ఆ మరునాడే ఆమెకు పరిపూర్ణదీక్ష ఇచ్చాడు.

రాగమంజరి అతని అపార వాత్సల్యానికెంతో సంతోషించి సాష్టాంగనమస్కారం చేసింది. వేడి వేడి కన్నీటితో ఆరుణిముని పాదాలు తడిపివేసింది.

ఆమె శ్రద్ధాభక్తులు పరిశీలించిన ఆరుణికెంత ప్రయత్నించినా కనుగొలుకులలో కన్నీటిబిందువులు నిలవలేదు. అవి నెమ్మది నెమ్మదిగా అతని చెక్కిళ్లపై దిగజారాయి.

—సశేషం





"మధురానగరి దారిలో"

చిత్రకారుడు: చావలి నమశ్శివాయశర్మ.

# ఆఖరు వైనం


దండమూడి
బాలగంగాధరరావు


నిర్మల – శివరాంలు సంవత్సరానికి ఆరు నెలల క్రితం ఓ శుభముహూర్తాన దంపతులయినారు. ఇద్దరూ తమాషా మనుష్యులే! ఏ కొంచెం మెచ్చినా తట్టుకునే స్వభావం కాదిద్దరిదీ. ముచ్చటగా వుంటే—అలా వుంటారు; భేదిస్తే ఇట్టే ఉగ్రరూపు లయిపోతారు. వీరిద్దరిమధ్యా ఓ చిట్టిపాప! పాప మూలంగానే ఎక్కువగా తగవు లొస్తూవుంటాయ్. మళ్ళీ పాప అంటే ఇద్దరికీ తగని ప్రేమ!

భర్తతో వేరేకాపురం పెట్టాలనీ, బస్తీలో ఉండాలనీ నిర్మలకు తీరని ముచ్చట.

శివరాంకేమో ఉద్యోగం లేదు. సరదాగా వుండే స్తోమతా కాదు. అందుమీదట "ఊరికే ఎందుకూ!" అన్నాడు. ఇది రోజూ పాడేపాటే. "ఊరికే కాకపోతే ఉద్యోగమెవడిస్తాడూ?" అంది మూతి మూడు వంకరలు త్రిప్పి.

"ఉద్యోగమంటే—నీకూ, నాకూ పెళ్ళయినంత తేలిక కాదు."

"పోదురూ- ఆ ముఖాలే వేరు" అన్నట్లు పెదిమ విఱిచింది. చివుక్కుమంది అతగాడి ప్రాణం.

నిర్మల ఎన్నోసార్లు పట్టణంలో యిల్లు చూడమనటం—అతనేదో సాకు చెప్పటం.. పర్యవసానంగా వాళ్ళిద్దరిమధ్యా కొన్నిరోజులు అశాంతి...ఈసారి ఏదో ఒక నిర్ణయానికి రావాలనుకున్నాడు శివరాం. గదిలోనుంచి వెళ్ళిపోతూ "నా పంట డబ్బుతోనన్నా వెలిగించండి కాపురం......నేనిక్కడుండలేను క్షణం"అంది. ఇక గత్యంతరం లేకపోయింది అతనికి.

పట్టణం మూడు మైళ్ళుంటుంది. వెంటనే వెళ్ళిపోయాడు. స్నేహితుని "ఎంక్వైరీలో" ఓ యిల్లు ఉండటంతో అతని హృదయం వికసించింది. ఇద్దరు కలసి యిల్లు చూచి వచ్చారు. అద్దె ఏమంత ఎక్కువనిపించలేదు శివరాంకి, నిర్మలను సంతృప్తిపర్చగలుగుతున్నాననే సంతోషంలో. బాగుందంటే బాగుందనుకున్నారు. స్థిరంచేసుకుని ఇంటిముఖంపట్టాడు శివరాం.

దారిలో—నిర్మలను ఎప్పుడు కలుసుకుంటానో, విషయం ఎప్పుడు చెప్తానో—అని, ఆనందం పట్టలేకపోతున్నాడు..దొంగ! నిరాశగా కూర్చుంటుంది. ఆ కళ్లు ఆలోచనలను అన్వేషిస్తున్నట్లు ఉంటాయ్! బరువుగా కళ్ళు మూసుకుంటుంది; కొలనుఒడ్డున ఆల్చిప్ప గుర్తుకువస్తుంది. అప్పుడు మూడ బుద్ధవుతుంది. పాపం! ఎన్నోసార్లు ఆశ పెట్టాను. విషయం చెప్పితే నమ్మదుకదా! ఏ ఇల్లాలు కోరుకోదు—భర్తతో బస్తీలో కాపురం చేయాలని? అందులో—తనేదో చదువుతున్నాననీ, ఉద్యోగం వెలిగిస్తాననీ-వాళ్ళనాన్నగారు కోరిన కట్నం ఇచ్చారాయె. పెళ్ళి అయిపోగానే పరీక్షకుకూడా వెళ్ళలేదాయె తను. తన తప్పేమట్టుకేముంది, ఇందులో! తనను ఆమెగారు చదవనివ్వందే-తనవదనే ఉండమనేది. ఆకర్షణ అటువంటిది. ఏదయినా, తన దౌర్బల్యం - 'అందుకు అనుభవిస్తున్నాను-' అనుకున్నాడు.

ఇంటికి వెళ్ళాడు. అమ్మ పాపనెత్తుకుంది. నిర్మల ఏదో పనిలోఉంది. తను వచ్చినట్లయినా గుర్తించలేదు. ఎందుకు గుర్తించుతుంది? తనంటే-తేలికా, నిర్లక్ష్యమూనూ. కొంచెం చప్పుడు చేశాడు. గ్రహించికూడా, ఇటు చూడనన్నా చూడలేదు. కోపం వచ్చింది; అలిగి మాట్లాడకుండా పడుకున్నాడు. చీకటి పడబోతున్నా దర్శనమే కఱవైంది. తలపొగరు దించాలనుకున్నాడు. "నెగవబెట్టు" అనుకున్నాడు. "మూడ్" పాడు చేసేసింది. తను ఎంత ఉషారుగా ఖుషీగా వచ్చాడు? తల్లక్రిందులైంది, వ్యవహారం.

చీకటి పడింది. దీపం వెలిగించి, భర్త గదిలోపెట్టి వెళ్ళిపోయింది. చప్పుడు వినిపించేప్పటికి కళ్లుమూసుకుని, లేపుతుందనే ఆశతో-నిద్ర పట్టినట్లు నటించాడు. కొద్దిగా కళ్ళు తెఱచి చూచేప్పటికి తుఱ్ఱున వెళ్ళిపోయింది. నిరుత్సాహపడ్డాడు; నిబ్బరం కోల్పోతున్నాడు. ఐనా, అలాగే మంచాన్నికఱచుకు పడుకున్నాడు.

అంతలోనే, అమ్మ అంటోంది, "నిర్మలా! అబ్బాయి వచ్చినట్లున్నాడు. గదిలో ఉన్నాడేమో చూడు. అన్నం వడ్డింతువుగాని" అని. మళ్ళీ కళ్లు మూసుకున్నాడు. చప్పుడైంది. గట్టిగా మూసుకున్నాడు. నిర్మల భర్తవైపు చూచి, "ఊఁ" అనుకుంటూ విసురుగా దూరంలో కుర్చీని వరించింది. నెమ్మదిగా తెఱచాడు కనురెప్పలు. కళ్లు మూసుకుంది. "దొంగా!" అనుకొని తనూ మూశాడు. మళ్ళీ తెఱచేప్పటికి అంతే. ఈసారి అలాగే ఉన్నాడు. దొంగ దొరికింది! తప్పించుకోలేకపోయాడు తనూను. ఒకరికి ఒకరు ఓడిపోయారు. నవ్వాడు తనలో. తనూ నవ్వింది మందంగా. తనను కవ్వించిందా నవ్వు! లేచాడు. "మాట" అన్నాడు. రాలేదు. ఏదో ఆలోచిస్తున్నట్లు చూస్తోంది. ఆ ముఖం తనను రెచ్చకొట్టింది. "బలే విషయం" అన్నాడు. ఉలక లేదు. బ్రతిమాలుతున్నట్లు ముఖం పెట్టాడు. పలక లేదు. "ఇల్లు కుదిరింది" అన్నాడు, ఉత్సాహం అపుకోలేక. పెదిమ విఱిచింది. గతుక్కుమన్నాడు. "నిజం! నామీద ఒట్టు" అన్నాడు విసుగ్గా. ఆశగా వికసించిందామెముఖం. "నిజం నిర్మలా! ఇల్లు చాలా బావుంది" అన్నాడు. "ఐతే, ఎప్పుడు ప్రయాణం" అన్నట్లు ప్రశ్నార్థకంగా చూసిందామె. రాత్రికి తండ్రితో మాట్లాడి రెండు రోజుల్లో వెళ్ళిపోదాం అన్నాడు. దగ్గరగా వచ్చింది—అతనిచేతులొత్తి. "పాపేది?" అన్నాడు. నిద్రపోయిందన్నది. వెళ్ళి భోజనాలకు ఉపక్రమించారు.

మధ్యలో, "అనవసర[illegible] ఉంటం అవుతుంది-బస్తీలో" అని గొణిగాడు. "మళ్ళీ మొదలా?" అన్నట్లు చూసింది. "నీదంతా అపోహ! తోటివాళ్లను అర్థం చేసుకోలేవు-సర్దుకుపోలేవు" అంటూ, "ఆ శక్తి లేనంత వరకూ నువ్వు ఎక్కడా సుఖం పొందలేవు" అని విరమించాడు.

"మీ రేమన్నా అనండి-నేను మాత్రం ఒకరిక్రింద ఉండలేను. మీ అమ్మగారి పోరు పడలేను,"అంది ఆవేశంగా. "నీబాగు కోరేగా-మా అమ్మ ఏనా చెప్పేది"అన్నాడు. "నాకెవరూ చెప్పనవసరం లేదులే" అంటూ అలిగింది. "ఉత్తినే అన్నాలే" అన్నాడు నవ్వు తెచ్చుకుని. బుంగముఖం పెట్టింది. నెత్తిమీద ఒకటి వేశాడు. నవ్వి పూరుకుంది.

తల్లి ఏదో ఒకటి అంటుంది; పెత్తనం చేయాలనే స్వభావం తల్లిది. అందుకు నిర్మల సహించలేదు. ఈమెగారికి రోషం



# ఆఖరు వైనం



ఎక్కువ. అమ్మ ఈమాత్రం గ్రహించలేదు. మధ్య నలిగిపోయేది తను. తన బ్రతుకు అలాంటిది అనుకున్నాడు.

తండ్రి వచ్చి భోజనం ముగించి త్రేపుకుంటూ బజారులోకి బయల్దేరాడు. అతను వెంబడించి పొడిదగ్గు దగ్గాడు. తండ్రి వెనక్కు తిరిగాడు, ఏమిటన్నట్లు. క్షణం నిశ్శబ్దం. "ఏమిటి?" అని తండ్రి అందుకున్నాడు. నోరు విప్పినా స్వరం రావటంలేదు. అలాగే శ్రమపడి "టవున్‌కు...వెళ్లివచ్చాను...ఇల్లుకోసం..." తడబడుతూ అన్నాడు. "ఎందుకు?"-"ఊరికే వుందామనిఉంది-" తండ్రి నవ్వాడు. తను పాతాళంలోకి కూరుకుపోతున్నాడు. అంతకన్నా తిట్టితే బాగుండుననుకున్నాడు. "ఎందుకోయ్-టవున్‌లో కాపురం? దర్జాకా?" ప్రశాంతతను భంగపరుస్తూ అన్నారు. కొంత నిలద్రొక్కుకుంటూ, "ఇక్కడ ఉండిమాత్రం చేసే దేముందీ-అక్కడె ఉద్యోగంకోసంఐనా ప్రయత్నిస్తాను" అన్నాడు శివరాం, నీళ్లు నములూ. "మరి ఖర్చు విషయం ఆలోచించావా?" అన్నారు వ్యంగ్యంగా," "ఐతే అయింది...వాళ్ళ పంటపెట్టుందిగా, తెస్తానంటోంది"-అన్నాడు. "ఐతే నీ యిష్టం" అంటూ వెళ్లిపోయారు. శివరాం ఆనందానికి హద్దులు లేవు. తండ్రి అంతత్వరలో ఒప్పుకుంటాడని ఆశించలేదు తను.

## 2

పంచమిరోజు మంచిదని బస్తీలో ఇంటికి వచ్చారు. ఇల్లు నాలుగుమూలలూ పరీకించి, "చాలా బాగుందండీ!" అంటూ నిర్మల వచ్చింది. "నీకు నచ్చితే-నా కదే చాలు" అన్నాడు పాపను అందుకుంటూ శివరాం. "ఊఁ!" అంది వయ్యారంగా అలాగే చూస్తూ నిలబడిపోయాడు శివరాం.

బస్తీలో కాపురం-ఖర్చు అవుతున్నా ముచ్చటగానే జరిగిపోతోంది. సినిమాలు, పార్కులు...ఒకటేమిటి?...నిర్మలకు అన్ని సరదాలూ తీరుతున్నాయ్. క్షణం భర్తను వదలివుండటంలా. ఇంటివద్దనైతే-కనీసం అత్తగారు అనే భయంతో కొంత స్వేచ్ఛను, కించిత్ వ్యక్తిత్వాన్ని త్యాగం చేయవలసివచ్చేది. ఇక్కడ తనకు తాను స్వతంత్రురాలు. భర్త తనకు స్వేచ్ఛనిచ్చే మనిషి. ఇంకేం?

అతనికిమాత్రం కంపరంగానే ఉంటోంది. ఎప్పుడూ ఇంటవద్దే ఉండవలసొస్తోంది. బైటకు వెళ్తుంటే-"నేనూ బ్రతికేఉన్నాను" అన్నట్లు తయారౌతుంది. ఒంటరిగా ఇల్లు విడచి వెళ్లటం గగనంగా ఉంటోంది. కాస్సేపు దగ్గరలోఉన్న లైబ్రరీకి వెళ్లడం పడటంలేదు. కొంచం ఆలస్యంఐతే మూతి ముడుచుకుంటుంది. ఏ పనీ చేయదు. ప్రాకటం పూర్తిగారాని పాప నిలబడటానికి యత్నం చేస్తుంటే చూస్తూ ఊరుకుంటుంది. తనమీద కోపంతో. పసిగుడ్డు రాతిమీద పడ్తుంది. గుక్కపట్టి ఏడుస్తుంది. ఎత్తుకోదు మరి. బైటికివెళ్లి వచ్చినందుకు శిక్షగా-రాత్రి నిద్రపుచ్చేవరకూ మోయవలసిందే.

రాత్రిళ్లు చదువుకుంటుంటే ఊరుకోదు. లైటు వెలుతురు భరించలేనంటుంది. ఇంకో గదిలోకి వెళ్లి చదవబోతుంటే-తనకు భయం అంటుంది. ఎలా చచ్చేది? గత్యంతరంలేక పుస్తకంమూసి తనూ పండుకొనేవాడు.

పగలు తనకు తీరికే తక్కువ. పనంతా నిర్మలచేసుకుంటూంటే తనకు చదవ బుద్ధయేది కాదు. తన దౌర్బల్యమనే చెప్పాలి. నిర్మలకు వెళ్లి సహాయపడ్తూ ఉండేవాడు-కుళాయి నింపటంలో — పాపను ఎత్తుకోటంలో.

ఊళ్లో వుంటేనే హాయిగా ఉండేది. తోచినప్పుడు చక్కగా టవున్‌కు వచ్చి కాలక్షేపంచేసి వెళ్ళేవాడు. స్నేహితులంతా కనిపించినప్పుడు నిష్ఠూరంగా మాట్లాడుతున్నారు. "కాపురం పెట్టాక అసలు కనుపించటంలేదని"-తనకు ఎక్కడా తృప్తిలేకపోతోంది.

* * *

తను వచ్చినకర్తవ్యం గుర్తుకొచ్చేది - ఏరోజు కారోజు నిద్రపోయేటప్పుడు. విజ్ఞాన పరిశోధన చేయాలని అంతరాత్మలోని వాంఛ. ఉద్యోగంచేయాలని పైకిమాత్రం ఉబలాటం. ఈ ఉబలాటం ఆధారంగాచేసుకుంటేనే గాని-తను పట్టణంలోఉండి సత్‌గ్రంథాలు చదవడానికి వీలుపడదు.

ఇక ఏదో ఒక చక్కని క్రమమైన నడత అలవర్చుకోవాలనుకున్నాడు. ఇలా కొంత కాలం ఉంటే-రాతియుగంనాటి మానవునికీ తనకూ తేడాయే కనిపించదు. ఉన్న కొద్దిపాటి పరిజ్ఞానంకూడా నశించిపోతుంది. అది ఖాయం. ఇంతవరకూ చదివిందంతా పక్వమువకుండానే రాలిపోతుంది.

ఇప్పటివరకూ నిరక్షరాస్యుడుకూడా ఒక మనిషిగా బ్రతకగల్గుతున్నాడు. ఇకముందు అలా జరుగదు. తను చదివినచదువే చాలదు. శాస్త్రంతోపాటు మానవుడు కూడా మారుతూ ఉండాలి. అటువంటప్పుడు తనూ సాధించిన కొంతవిజ్ఞానాన్ని ఇగరనివ్వకుండా జాగ్రత్తపడాలి. తనకెన్నో అభిప్రాయాలుండేవి. కలెక్టరు వెలిగిద్దామనీ-కౌన్సిలర్ పదవి స్వీకరిద్దామనీ ఉండేదికాదుగాని, ఎన్నో గ్రంథాలు చదివి సాహిత్యవిమర్శకుడుగా రూపొందాలనేది చిరకాల వాంఛ. ఇక ఊరుకోరాదు. హృదయంలోంచి వేడిగాలి ఛాతీమీదుగా ఒత్తుగావున్న జుత్తును కదిలించి వెళ్ళిపోయింది. అరంగుళం పైకి పొంగినట్లుంది శరీరం. వెంటనే నిర్మలను పిల్చాడు.

రెండు మూడు కేకలకుగాని రాలేదు. వస్తూనే, "నన్ను లార్డులా కేకలు వేయకపోతే-ఆ పిల్లను కాస్త ఎత్తుకోరాదటండీ" అంది విసుగ్గా. సగం తగ్గి మళ్ళీ ఆవేశం తెచ్చుకుని, "ఏయ్! పిల్లనెత్తుకోటం-నిన్ను బ్రతిమలాడటంకాదు నా కర్తవ్యం. ఏదో ఈ నెల్లాళ్ళూ నీ కోర్కెలు తీర్చాను. ఇక అలాజరగదు. నా లక్ష్యం వేరు; నన్ను బ్రతకనివ్వు...ఇంటివిషయాలన్నీ నీకు వదిలేస్తున్నా. అంటే-గృహిణిగా నీకు స్వాతంత్ర్యం ఇస్తున్నానన్నమాట. నా చదువుకు మాత్రం అడ్డంరాకు. ఆలోచించుకో. ఆఁ...అలా చెయ్యి." ఇంతటి ఉపన్యాసం ఆమెవద్ద ఎప్పుడూ చేయలా. అందుకు అతనికే ఆశ్చర్యం వేసింది. నిర్మల ఒక్క పెట్టున తెల్లముఖం వేసి ముఖకవళికలు మార్చుతూ, "ఇంతకూ మీర నేది-నన్నొక జంతువుగాజేసి ఆ వంటఇంటి పొలిమేరలో విహరించమనేగా" అమాయకంగానూ, రోషంగానూ అంది. "మరి? నీ ఉద్దేశ్యం నన్నొక ఫూల్‌ని జేసి నా స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛనూ ఆకళింపుచేసుకుని నన్ను ఆశీర్వదిద్దామనేగా!-అలా వీలులేదు. నేచెప్పినట్లు చెయ్యి; లేకుంటే...ఇంటికివెళ్దాం"-అన్నాడు గంభీరంగా. "ఇంతేగా మరి మీ ప్రయోజకత్వం" అంటూ వెళ్ళిపోయింది రుసరుసలాడుతూ, సహజమైన దుఃఖాభినయనంతో.

కాస్సేపు ఇద్దరిమధ్యా అగాధం. వీరిద్దరిముఖాలూ చూసి పాప భయపడిపోయి గావురుమంది. నేను తీసుకోనుఅంటే నేను ఎత్తుకోనూ వరకూ వచ్చింది. వెంటనే ఇద్దరూ ఒక్కసారే ఎత్తుకోబోయారు. ఒక్కచోటకు వచ్చారు. శివరాం ముందు పాపను అందుకున్నాడు. వెంటనే నిర్మల పాపను విసురుగా లాక్కుంది. క్షణంసేపు ఒకర్నొకరు చూచుకున్నారు. చూపులు ఒక్కసారి కల్సినయ్. పాప కిలకిలమంది. నిర్మల పెదాలు వంపులుతిరిగాయ్. శివరాం నవ్వకుండా ఉండలేకపోయాడు.

కొంతసేపాగి, "నేను అన్నానని కోపగించకు నిర్మలా? ఉభయులకూ నష్టమే. నా సుఖం నీకు ఆనందం కాదా? నేను బాగుపడటం నీకు ఇష్టం లేదా!—నన్ను కాస్త గాలి పీల్చుకోనివ్వు."

"పోనీ, నీకు తోచకుంటే ప్రక్కవాళ్ళిం

టికి వెళ్ళు. వాళ్ళిళ్ళకు వెళ్ళడం నామోషీ ఐతే- మనయింటికి వాళ్ళువచ్చేట్లు చెయ్యి. ఏదోవిధంగా సర్దుకోవాలిమరి" అన్నాడు లాలనగా, "అలాగే" అంటూ బుద్ధిగా కూర్చుంది జెడ ముందుకు లాక్కుంటూ, పాపను దగ్గరకు తీసుకుంటూ. ఊహించరాని మార్పుకు శివరాం తబ్బిబ్బైపోయాడు. విజయగర్వంతో లేచినుంచున్నాడు. నిర్మల తలనిమిరి, "ఎంత మెత్తనిమనసూ" అన్నాడు. కళ్ళు రెపరెపలాడించి మూసుకుంది నిర్మల. పాపను తీసుకుని హృదయానికి హత్తుకున్నాడు.

# 3

రోజూ లైబ్రరీకి వెళ్ళి వస్తున్నాడు, శివరాం. కోరిన పుస్తకం తీసుకుంటూ 'నోట్ బుక్' ఒకటి పోషిస్తున్నాడు. హాయినా గడచిపోయింది ఒకవారం.

ఒకరోజు- మధ్యాహ్నమౌతోంది. మానసిక వికాసానికి దోహదమిచ్చే పుస్తకం అందింది ఆరోజు. తృప్తిగా చదువుకున్నాడు; మాంచి ఉల్లాసంగా ఉన్నాడు. ఇంటికి వచ్చి గుమ్మంముందు ఆగిపోయాడు శివరాం. అదొక మధురఘట్టం! ముందుకు అడుగు వేయలేక...వెనక్కు అడుగుపడక అక్కడే సందిగ్ధంగా దిగ్భ్రమ చెందుతూ నిలబడిపోయాడు. ఎదురుగా—గదిలో, నిర్మల పాపతో పండుకొనిఉంది. ప్రక్కనే క్రింద తివాచీమీద ఎవ్వరో వయ్యారపు వనిత— శిల్పిచెక్కిన చలువరాతి ప్రతిమలా, కూర్చొని ఎంబ్రాయిడరీ పనిలో మునిగిఉంది శివరాంను గమనించనే లేదు.

శివరాం కళ్ళల్లో వేయి మెర్క్యురీలైట్లు ఒక్కసారి వెలిగాయ్. ఏమి సౌందర్యం? ఏమి వర్చస్సు!! ఇంతకుపూర్వం ఎప్పుడూ చూడని వాలకం...రోజాపూల కూజా! సన్నజాజీల మజా! ఏవేవో పారిజాతాల పరిమళాలు! అన్నీ...అన్నీ ఆ ఒక్క గదిలోనే ఇమిడిఉన్నట్లు భ్రమించాడు. అందులోనూ వయసువచ్చిన చిన్నారివనిత, రంగుల తివాచీమీద—కుమ్మరిడికొయమీద మంచు ఓందువులా- కూర్చొని కుట్టుకోటం ఓ అందం. ఇంద్రపురి దేవకన్యల స్వాప్నిక సౌందర్యం చూడగలాడు స్పష్టంగా— అలా నేనుంచుని. ఎంతసేపని? ఎంతకాలమైనా అలాగే నుంచు నేట్లు ఉన్నాడు. అంతలోనే ఆ కోమలిముఖం పైకెత్తటం-ఒక్కసారిగా సిగ్గుల రామచిలుకై చివాలున ప్రక్కకు తప్పుకోవడం జరిగింది. లోనికి వెళ్ళలేక అలాగే హాలులో కూర్చుని ఉండిపోయాడు. "అక్కా, అక్కా!" అంటూ లేపుతోంది నిర్మలను. ఆ చనువునుచూసి చిరకాల స్నేహితులని భావించాడు.

ఎవరీ అమ్మాయ్? ఎవరైతే నేం, తనకెందుకు? నిర్మల లేచి భర్తవైపుచూసి నవ్వుకుంటూ వెళ్ళిపోయింది. తనూ నవ్వాడు.

పెరటి తలుపుతీసి గడియవైచిన చప్పుడైంది. అన్నీ వింటూనే ఉన్నాడు. ఆ అమ్మాయి వెళ్ళిపోయినట్లు గమనించాడు. నిర్మల నిర్మలంగావచ్చి కూర్చుంది. ఎంత హుందా? ఏమిఠీవి? ఆడపడుచుకు తనకన్నా అందమైన స్త్రీతో సాంగత్యం ఉంటే ఘనత కాబోలు! ఎంతగర్వం? అనుకున్నాడు.

నిర్మల అతని ముఖకవళికలు అనుక్షణం పరిశీలిస్తూనే ఉంది. అది సహించలేకపోయాడు, శివరాం. ఆ బారెడేసి కళ్ళు తనను వెక్కిరిస్తున్నాయ్. "ఊ?' అని, నిట్టూర్చాడు. "అలా ఉన్నారేం!" అంది గబుక్కున. "ఏమీ లేదు" అంటూ ముఖం తప్పించాడు. గతుక్కుమంది.

నిర్మల ఎంతో ఉషారుగా ఉంది. భర్త తన ఆనందాన్ని పంచుకోకపోతే సహించలేదు తను. అతన్ని ఉత్సాహపర్చదల్చుకుంది. "మీరు ఆ అమ్మాయిని చూశారా?" అంది నెమ్మదిగా. కళ్ళు తెరచాడు. "చూశారా!" అన్నట్లు రెట్టించి, నవ్వింది. కాంతిగా మెఱిశాయ్, అతనికళ్ళు. "ఎవరూ?" అన్నట్లు చూశాడు. "చెప్పను!" ఆమె కళ్ళు తెలిపాయ్. అలిగి మూసుకున్నాయ్, అవతలికళ్ళు. "అందుకే మరి" సముదాయింపుగా అంది. అలాగే ఉన్నాడు. నవ్వుకుంది. "గారాబం అయ్యగార్కి" అంటూ దగరకువచ్చి, "రోజూ మంచినీళ్ళకు మనింటికి వస్తుంది - సీత అని" అంది. "ఎదురుగా ఇల్లు" అంది. "ప్రస్తుతం అక్కగారింట్లోనే ఉంటోంది — తల్లి లేదు పాపం......తండ్రి తాగుబోతట" అంది. "సీత బావకు, సీతంటే మక్కువనీ--అతనే మళ్ళీ పెళ్ళిచేసుకుంటానంటున్నాడనీ— వాళ్ళ అక్కకు అంగీకారమనీ, చెప్పవద్దనుకుంటూనే చెప్పేసింది.

"వాళ్ళ బావకేమిటిపని" అన్నాడు. "కలక్టరేటులో క్లర్కట" అంది నిర్మల. "మరి అ అమ్మాయికి బావంటే ఇష్టమేనా?" అని అడిగాడు శివరాం. "లేదట" అంటూ ఆదోమాదిరిగా వ్యంగ్యంగా చూసింది, నిర్మల.

అప్పుడే పాపలేచింది. లేవగానే ఏడ్వడం మొదలెట్టింది. పాపను తీసుకొచ్చి భర్తకిచ్చింది నిర్మల. బుజ్జగించి భుజాన వేసుకున్నాడు. ఏడుపు ఆపింది. నిర్మల నవ్వుతూ అంది, పాప అంటే సీతకు ఎంతో ప్రాణం అనీ, అందుకోసం రోజూ వస్తోంది అని. నిద్రబద్ధకంపోయి తండ్రికి ముద్దుల వర్షం కురిపిస్తోంది, పాప. అల్లంతదూరంలో చూస్తూ ఊరుకుంది నిర్మల.

శివరాం ఆలోచనంతా సీతమీదే నిల్చింది. అనుక్షణం సీత అతని కళ్ళల్లో మెదుల్తూ ఉంది. ఆ బంగారు బుగ్గలు. ఆ కోలముఖం లోంచి ప్రకాశించే వాలుకన్నులు...ముఖంలోని ప్రసన్నత - ఒక్కక్షణమే చూసినా- మరువలేకపోతున్నాడు.

నిర్మల గుంభనగా భర్తనుచూస్తూ ఉండిపోయింది. అతనిమీద జాలివేసింది. ఎంత పిచ్చిమనసు! ఇట్టే జారిపోతారు పురుషులు. ఆకర్షణకు ఇట్టే లొంగిపోతుంది మనస్సు, అనుకుంది. భర్తమీద ఏదో అనిర్వచనీయమైన సానుభూతి కల్గింది.

రాత్రికి నిర్మలను కదలిద్దామనుకున్నాడు. అతని హృదయం సీతకుగూర్చి తహతహపడుతోంది.

రాత్రి మాటల్లో "సీవద్ద కుట్టుపని నేర్చుకుంటోందా?" అని అడిగాడు. "ఏం?" అన్నట్లు చూసింది. "మీకెందుకూ—ఆ సంగతి" అన్నది గర్వంగా. ముఖం వంచుకున్నాడు. "అవును; నేర్చుకుంటుందిక: నేర్పమంటారా?" అంది కంచుగంటలా. నవ్వుకున్నాడు. నవ్వింది. "నేర్పరాదూ మరి!" అన్నాడు. "అలాగే" అంది, నిండుగా. కొద్దిపాటు నిశ్శబ్దం. "ఏమిటీ ఆలోచిస్తున్నారు!" అంది. "అబ్బే! ఏమీ లేదు" అన్నాడు. కళ్లు మూసింది నిర్మల.

ఆ రాత్రి నిర్మలకు నిద్రలో కలవరింతల్లూ పలవరింతలు. ఆకాశంలో విహరిస్తూం అక్కడనుంచి సీతా - శివరాంలు జంటగా ఇంకా పైకి ఎగిరిపోతున్నారు. ఎంతో ఉషారులో ఉన్నారు; తన వంక చూడనన్నా చూడడంలేదు. విహంగాలై విహరిస్తున్నారు. తను హిమవత్పర్వత పంక్తులపైకి దిగి, అక్కడనుంచి జారిపోతోంది క్రిందికి, వాళ్లు చంద్రమండలానికి సమీపిస్తున్నట్లుంది. తను సహించలేకపోయింది; ఐనా రాలిపోతోంది. క్రిందంతా రాళ్లూ, రప్పలు. ఒక్క ఊపుతో విసురుగా నేలమీదపడింది. ఉలిక్కిపడిలేచి ఒళ్లు తడుముకుంది. ప్రక్కనే శివరాం నిద్రపోతున్నాడు. అతని ముఖంమీద జుత్తుక్రిందకీ పైకీ పడుతోంది-కిటికీలోంచి వీచే చలిగాలికి. తనకు ముచ్చెమటలుపోసి ఉన్నాయ్. కల నిజంకాదని సంబరపడింది. ఐనా, భయంగానే ఉంది.

భర్తను లేపింది. మత్తుగా అటు తిరిగి పడుకున్నాడు. నిర్మలకు కోపంవచ్చింది.

తెల్లవార్లూ నిద్రపట్టలేదు. పిచ్చి అనుమానాలు మనస్సును చిరాకు పరుస్తున్నాయ్. సమాధాన పరచుకునే శక్తి తనకు లేదు.

తెల్లవారాక భర్తవంక పరీక్షగా చూసింది. అతని ముఖం ఎంతో ఠీవిగానూ-గర్వంగానూ

#  ఆఖరు వైనం 

ఉన్నట్లగుపిస్తోంది. ఆమెకు అతనిమీద ఆమె కున్న సానుభూతిస్థానే జెలసీవచ్చి కూర్చుంది.

ఆ మధ్యాహ్నం సీత మామూలుగానే వచ్చింది. శివరాం రోజూ లైబ్రరీకి వెళ్ళే వాడు; ఆరోజు వెళ్ళలేదు. పక్షానికి ఓ రోజు—ఏదో బద్ధకంతో వెళ్ళలేకపోవడం పరిపాటే — కాని నిర్మలకు గుర్తు రావటం లేదు, మానివేసిన రోజులు. దానిమీదట అనుమానం స్థిరం అయింది. అంతలో "క్లార్క్" కంపెనీదారాలకోసం, అలమరా తీయబోతూంటే — వరండాలోని శివరాం వంగి చూస్తున్నాడు; సీత నును సిగ్గుల దొంతర అయింది; తనకు వళ్లు మండుకొస్తోంది. అప్పుడే — శివరాం మంచినీళ్లు తెమ్మంటున్నాడు. పనిలేకపోతే అక్క, లెక్క వంటారు. ఇంటివద్ద మగవాడు ఉంటే— ఎందుకు పనికి వస్తాడు? త్వరత్వరగా మంచి నీళ్ళకని వంట ఇంటిలోకి వెళ్ళింది. ఉక్కిరి బిక్కిరి ఐపోతోంది. వెధవగోల! ఈపిల్ల ఒకటి! క్షణం వదలి ఉండదు—గుక్క పట్టింది. మంచి నీళ్లు పట్టుకుని వరండాలోకి పరుగెత్తింది. ఎక్కడున్నారు ఆయన? గదిలో సీత చేతుల్లో నుంచి పిల్ల నందుకుంటున్నాడు. ఆ అమ్మాయేమో ... ఆయనవంకే చూస్తూ పాపను ఇస్తోంది.' ఛీ! సిగ్గుండదు ఈ బస్తీమూకకు. బాగుంది వరస? ఆడదానికి అంత స్వేచ్ఛ ఐతే ఎలా?

ఇక వూరుకోలేక అనేసింది—"దీనితో వేగలేకుండా వున్నాను- రేపు కుట్టు నేర్పుతానులే...ఇవాల్టికి వెళ్ళు" అని.

సూది, దారం, వస్త్రం సర్దేసి చటుక్కున "రేపు వస్తానులెండి" అంది సీత. "మంచిదమ్మా" అంటూ తలుపు గడియవైచి విసురుగా లోనికి వచ్చింది. ఒక్కసారి త్రాచు పాముపడగలా కోపం అతనిలో నాట్యమాడింది. "ఛీ!పాడు అనుమానాలు"అంటూ విసుక్కున్నాడు. ఇష్టంవచ్చినట్లు తిట్టేశాడు. తనకికతగవు అన్నాడు. మనస్సు ఇచ్చి మనస్సు తెల్సుకోలేవు అంటూ నిట్టూర్చాడు. "నాగరికత నిలా నట్టేట కల్పి నగరంలో వుండకపోతే—యింటివ చావరాదూ" అని గర్జించాడు. పరోక్షంగా ఇది తనకు పతనమంటూ" ఇకముందు ఇటువంటివి సహించేదిలేదు" అంటూ మీదికొచ్చాడు. అకస్మాత్తుగా, తల వంచుకున్న మనిషి క్రిందికి పడిపోయింది. ఆడుకుంటున్న పాప గుక్కపట్టింది. మతి తప్పిన తల్లి వైపు చూచి, గావురుమంది. గడగడలాడిపోయాడు శివరాం. పాప నెత్తుకుని కావలించుకున్నాడు. రోషం కొస్తా దిగజారిపోయింది. గుక్కకు తట్టుకోలేక ఉక్కిరి బిక్కిరైపోతోంది పాప. క్రింద నిర్మల అటూఇటూ కొట్టుకుంటోంది. "హిస్టీరియా"! అదిరిపోయాడు. అదంటే అతనికి చచ్చేభయం. ఇంతకుపూర్వం నిర్మలకు ఎప్పుడూ వచ్చేదికాదు. "ఖర్మ! ఇక రోజూ రాదుకదా?"అనుకున్నాడు. ఫ్రాయిడ్ ఇది మానసికబలహీనతవల్ల వస్తుందంటాడు. పిచ్చి అనుమానాలు ఇంతపని చేశాయ్ అనుకొన్నాడు.' చిత్రం! కొంచెం తేరుకుంది. స్పృహవచ్చింది. పాపను తీసుకుని హృదయానికి హత్తుకుంది. కన్నీరు రెప్పలమీదుగా జారి ఒక్కొక్కటొక్కటే భూమిమీద పడ్తోంది. తలవంచుకుని ఏడ్చేసింది. చలించాడతడు. గత్యంతరంలేక బ్రతిమాలాడు.

ఇంతకూ తనేమన్నా తప్పుచేశానేమోనని మథనపడ్డాడు. అందుకు ఆత్మ ఎక్కడా అంగీకరించలా, తినను తను మళ్ళీ తర్కించుకుని ప్రశ్నించుకున్నాడు. అంతు పట్టడం లేదు. అంతలో నిర్మల "ఇంటికి వెళ్ళిపోదాం" అంది. పిడుగుపడ్డట్లు అయింది. ఉలిక్కిపడ్డాడు ... చల్లబడిపోయాడు చివరికి "వెంటనే వెళ్ళిపోవాలి" అని పట్టు పట్టింది" "హిస్టీరియా" గుర్తుకు వచ్చింది భయంకరంగా కంపించి పోయాడు. చివరకు అంగీకరించక తప్పింది కాదు.

మరునాటికే ప్రయాణం నిశ్చయించింది. ఆరాత్రి విషయం, నిర్మలను అడుగుదామని వుంది శివరాంకి. సూటిగా అడిగే ధైర్యం నశించింది. పెడమొగంగా ఉంది ఆమె వాలకం. రాత్రికి ఊరుకున్నాడు.

## 4

తెల్లవారింది. ప్రయాణం దగ్గర పడుతున్న కొద్దీ అతనికి బెంగలోంచి బాధ పీక్కుతింటోంది; వికారం కలిగిస్తోంది. అతనికి సమాధానందొరకలేదు. ఇక ధైర్యం చేసుకుని అడగాలనుకున్నాడు. కృతకృత్యుడు కాలేకపోయాడు—అందులో మాటలు యాస పోయినై. ఐనా, అర్థం వ్యక్తమైంది ఆమెకు. సమాధానం మట్టుకు సూటిగానే వచ్చింది—సూర్యకిరణంలాగ. అందుకు తట్టుకోలేకపోయాడు. అనుకున్నంతపనీ అయింది; ఇక

(31-వ పేజీ చూడండి)




## 2

మూడురోజులు గడచినవి. ఆ రోజు మధ్యాహ్నం ఆఫీసులో నా గదిలో కూచుని ఏవో కాగితాలు చూసుకుంటున్నాను. కోమలం ఆఫీసుకు వచ్చి 3-30 గంటలకు ఇంటికి రావచ్చునని చెప్పింది. సరిగా అదే వేళకు బయలుదేరి వెళ్ళాను.

బంగళా సింహద్వారం వద్దనే నన్ను చూసి బయటకు వచ్చి ఆమె లోపలికి తీసుకు వెళ్ళింది. తెల్లని గ్లాస్కో చీర కట్టుకుని, తెల్లని చెప్పులు తొడుక్కొని వుంది. మల్లె పువ్వులాంటి ఆ దుస్తులలో ఆమె సౌందర్యం నాకే కాదు అందరికీ మిరుమిట్లు గొలుపుతుంది. ఇద్దరం లోపలిగదిలోకి వెళ్ళాం అక్కడ చిన్న గుండ్రని 'టీపాయి', దాని మీద టీ సెట్టు, ప్లేట్లలో ఫలాహారాలు పెట్టి ఉన్నవి. టీ పాయికి రెండు వైపులా రెండు లోతైన సోఫా కుర్చీలు ఉన్నవి.

"కూర్చోండి. వారు ఊళ్ళో లేరు. స్వయంగా నేనే టీ తయారుచేస్తున్నాను," అంది.

ఆమెకు ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాను.

"చాలా సంతోషం. నేను ఆట్టే సేపు వుండను. తొందరపనిమీద బయటికి వెళ్ళాలి. మీరు కబురుచేస్తే, మోటారు కారు భీమా తిరిగి చేయటానికి చంద్రశేఖర్ గారునిశ్చయించుకున్నారేమోననుకున్నాను"

"ఆయన సాధారణంగా వూళ్ళో వుండరు. ఇక్కడికి యాభై మైళ్ళ దూరంలో వున్న నూనె గని దగ్గరికి వెడుతూవుంటారు. ఆ గని త్రవ్వకం, ఇంజన్లతో నూనె తోడించటం లేబరేటరీ పనులు, అన్నీ వీరి అజమాయిషీ కిందే జరుగుతూంటవి. రెండురోజుల కొకసారి బంక్ దగ్గరవున్న కార్యాలయానికి వెడుతూంటారు. ఎప్పుడూ నేను ఇంట్లో ఒంటరిజీవితం గడపాలి. నాకు ఏమీతోచక మిమ్మల్ని పిలుద్దామని మీ ఆఫీసుకు వచ్చాను," అంటూ కోమలం టీ కలపటం ఆరంభించింది.

"మీరు టీ తాగుతారా? కాఫీ కావాలా" అని అడిగింది, తల పైకెత్తి నా ముఖంలోకి చూస్తూ.

"ఇప్పుడు ఏమీ వద్దు," అన్నాను.

"లెమనెడ్ గాని, క్రష్ గాని తీసుకోండి. ఫలహారంతో" అంటూ ఒక ప్లేటు నా ముందుకు జరిపింది.

తుమ్మలపల్లి
సీతారామారావు

రెండు బిస్కట్లు తీసుకున్నాను. ఆమె కూడా ప్లేటులోంచి ఒక బిస్కట్టు తీసుకుని తుంచి నోట్లో వేసుకుంది.

"ఇవి బాగా తియ్యగా ఉన్నవి. సాల్టు బిస్కట్లు కూడా తీసుకోండి," అని మరో ప్లేటు నా ముందుకు తోసింది. ఇద్దరమూ బిస్కట్లు, టీ తీసుకున్నాం.

సంభాషణను తిరిగి భీమావ్యాపారం, భీమా పట్టా తీసుకోవటం మీదికి తిప్పాను.

"ఆయన మోటారు క్లబ్బునుగురించే మాట్లాడుతున్నారా? అయినా, మా కంపెనీలోనే భీమాచేస్తారనుకుంటా."

"అంతకంటే కావలసిందేమిటి? ప్రమాద భీమా విషయమై వారితో నేనేమీ మాట్లాడ లేదు.

"అట్లాగా?"

"ఈ ప్రస్తావన వారితో తీసుకురాక డానికి నాకు అసహ్యమనిపిస్తోంది."

"ఔను! నిజానికి అంతే."

"మీరుచేస్తున్న పనిలో ప్రమాదంవచ్చే అవకాశం వుంది కాబట్టి, ప్రమాదభీమా చేయాలని ముఖాముఖిగా వారితో చెప్పటం ఎలా వుంటుందో మీరే ఊహించండి."

"ఉద్యోగంగనులలో కాబట్టి, నూనెబావులలో దిగటం, త్రవ్వించటం, నూనె ఇంజన్లతో తోడించటం మొదలైనవన్నీ నిజంగా ప్రమాదకరమైనవే ఇలాంటివృత్తిలో భయంకర పరిస్థితులను ఎదుర్కొనటానికి నిత్యం సిద్ధంగా వుండాలి. "ఆయన పనిచేస్తున్న కంపెనీ, రక్షణకోసం వారిచేత భీమా ఏమీ చేయించలేదా?"

(30-వ పేజీ చూడండి)

# మాంత్రికుడు మాండ్రేక్

కల్పన, రచన:
....లీ పాక్, ఫిల్ డేవిస్....














మూర్ఛిల్లిన మాంద్రేక్‌ను. గోరీలోనివారు లోపలికి ఈడ్చివేశారు. అక్కడ...


పాడుగోల. ఎవడిపని వాడు చూచుకోడు. అన్నీపిల్లకేకాహాళి హం. ప్రతిదాంటోనూ....
మాంద్రేక్!




ఆహా, ఏమిముచ్చటైన చోటు ఈపాడుపనికి! ....మీరు దొంగనోట్లు చేస్తున్నారుకదూ?
చురుకైనవాడివే భేష్....ఏయ్.
నీలాగేఅక్కర్లేనిగోలజోలికెళ్లిఆపదపాలైంది.
7-4
CONTINUED—



(ఇంకా ఉంది)

 

# అపరబుద్ధి



(27-వ పేజీ తరువాయి)

"నాకు తెలిసినంతవరకు అటువంటిదేమీ వున్నట్లు లేదు."

"అటువంటి పరిస్థితులలో జీవితం గడపవలసినవాళ్ళు ప్రమాద జీవిత భీమా చేయటం చాలా అవసరం."

"ఆయన ఇంట్లో వున్నప్పుడు వచ్చి ఈ విషయం మొదట మీరు ప్రస్తావిస్తేనే మంచిది. ఈ సలహా మీకు ఇతరులు చెప్పినట్లు ఏ మాత్రం కనపడకూడదు. ఈ ప్రసక్తి మీరు మాఇంటికి వచ్చినపుడు నా ఎదుటే తీసుకువస్తే బాగుంటుంది."

"అయితే నేనే ప్రస్తావిస్తాను."

"అప్పుడు నీ అభిప్రాయం ఏమిటని ఆయన నన్ను అడుగుతారు. నేను ఏం జవాబు చెప్పాలి? ఇది నాకు మరీ గండకత్తెర సమస్యగా తయారౌతుంది. అయితే, చూడండి! ఆయనకు తెలియకుండా ఆయన జీవితం మీద ప్రమాద భీమా పట్టాతీసుకోటానికి వీలౌతుందా? ఇలా చేస్తే, ఆయనకు మీరు ఉపన్యాసంఇవ్వవలసిన అవసరమే వుండదు. నా సొంత డబ్బు కొంత నాదగ్గరే వుంది. దానితో ఆ పట్టాకు ప్రీమియం కడతాను. ఇందువల్ల వ్యవహారాన్ని ఆయనకు తెలియకుండానే పూర్తిచేయవచ్చు. ఏమంటారు?"

పదిహేనుసంవత్సరాలు భీమా వ్యాపారంలో అనుభవంసంపాదించిన నాకు ఆమె అభిప్రాయం తెలుసుకోటానికి ఆట్టేసేపు పట్టలేదు. కాలుస్తున్న సిగరెట్టు ఆర్పి ట్రేలో పడవేశాను. బయలుదేరాలని లేచాను. ఆశ్చర్యంతో ఆమె నాకేసిచూసింది. వెంటనే తిరిగి కళ్ళు మూసుకుని నిశ్చలంగా నిలుచునిపోయింది. మళ్లీ కళ్ళు తెరచి, జాలిగా నా ముఖంలోకి మరోసారి చూసి ఇలా అంది:

"మీ మాపుల్లో ఏదో అవ్యక్తమైన ఆకర్షణ వుంది. వాటిలో ఒక విధమైన ఆత్మీయత కనబడుతూంది. ఎటువంటి రహస్యాన్నైనా పదిలంగా దాచగల శక్తి వున్నట్లు తోస్తుంది."

"మీరు వర్ణించే లక్షణాలు నాలో లేవనుకుంటాను. నా చూపుల్లో బహుశా మీ హృదయం ప్రతిబింబించి వుంటుంది. అందుకే ఇలాంటిభావం కలుగుతోంది మీకు."

"మీరు టీకి ఇక్కడికే రావాలని కోరుతున్నాను. ఆయన ఇంట్లో లేనప్పుడల్లా, మీరు ఇక్కడికి వస్తుండాలి. ఆయన ఇంట్లో వుండని సమయాలు ముందుగానే తెలియజేస్తాను. తప్పకుండా వస్తానని నా చేతిలో చెయ్యేసిచెప్పండి," అంటూ లేచి, ఆమె నా చేతిని తన చేతిలోకి తీసుకుంది.

ఆమెకోరికను నిరాకరించేశక్తి నాలో లేకపోయింది.

"సరే; అలాగే; మరి వస్తా," అని బయలుదేరాను.

* * * *

నేను వుంటున్నది చిన్న బంగళా. అందులో క్రిందిభాగంలో ఒక పెద్ద హాలువుంది. వ్యాపారంకోసం నాతో మాట్లాడటానికి వచ్చేవాళ్లు ఆ హాల్లోనే కూచుంటారు. మేడమీద మూడుగదులు వున్నవి. ఒకగదిలో భోజనం చేస్తుంటాను. రెండోది పడకగది. మొదటి గదిలోకి నాతో సన్నిహిత పరిచయంవున్నవాళ్లు మాత్రమే వస్తుంటారు. బంగళా ప్రహరీలోనే కారుషెడ్డు కూడా వుంది. నేను ఇంట్లో లేనప్పుడుమాత్రం, నౌకరు కిందిహాలులో కూచుంటాడు. ప్రతిరోజూ రాత్రిపూట నేను భోజనంచేసిన తరువాత అతగాడు ఇంటికి వెడతాడు.

ఆ రోజు సాయంత్రం నుంచి జోరున వర్షం కురుస్తూనేవుంది. అందువల్ల నేను బయటికి వెళ్ళలేదు. ఇంట్లోనే వున్నాను. మేడమీద గదిలో ఒంటరిగా కూచుని కోమలం వ్యవహారం ఆలోచించసాగాను. ఆలోచిస్తూనే సోఫాలో నడుం వాల్చాను. దీపాల వెలుగులో సిగరెట్టుపొగ సుడులు తిరుగుతూ పైకిపోతోంది గుండ్రంగా. మహోన్నతమైన శిఖరాగ్రంమీద నిలుచుని అట్టడుగునవున్న అగాథమైన లోయలోకి తొంగిచూస్తున్నట్టు అనిపించింది నాకు. వెనుకకు మరలుదామనుకున్నాను; కాని అది నాకు సాధ్యపడే పనిలా తోచలేదు.

గోడమీది గడియారం తొమ్మిది కొట్టింది. ఆ ధ్వని నన్ను ఊహాప్రపంచంలోనుంచి వాస్తవిక జగత్తులోకి తీసుకొచ్చింది. బంగళా కిందిఅంతస్తులో గంటమోగింది. ఆ సమయంలో నా కోసం ఎవరు వచ్చేదీ ఊహించటానికి ఏమంత ఎక్కువసేపు పట్టలేదు. సన్నటి చీరమీద వానకోటు వేసుకుని తళతళా మెరుస్తూన్న నీటిబొట్లతో కోమలం మేడమీదవున్న నా గదిలోకి వచ్చింది. వానకోటు విప్పి వొంకెకు తగిలించి, నా దగ్గరకు వచ్చి కుర్చీలో కూచుంది.

"నా బంగళా ఎట్లా తెలిసింది?" అన్నాను.

"టెలిఫోను డైరెక్టరీలో చూశాను. ఏం? ఆశ్చర్యం కలిగిస్తూందా?"

"అబ్బె, లేదు."

"ఇది పురుషుల స్వాతిశయం. ఇలాంటిదాన్నిగురించి నేను ఇదివరలో వినడమే గాని ఎప్పుడూ చూడలేదు."

"చంద్రశేఖర్—ఇంట్లో లేరా?"

"గనులవద్దకు వెళ్ళారు. అక్కడ కొత్తగా ఒక బావిత్రవ్వకం ఆరంభించారు. మూడురోజులవరకు అక్కడే పనివుంటుంది. నేను బస్సుమీద వచ్చాను. నారాక మీకు ఆనందం కలిగించింది అంటారేమో ననుకున్నాను."

"గనులదగ్గర బాగుంటుందా?"

"ఏమో, నాకు తెలియదు. కమలాక్షితో సినిమాకి వెళ్లుతున్నానని చెప్పి ఆమెను కారెక్కించుకుని పంపి, నేను ఇక్కడికి వచ్చాను."

"ఎవరా కమలాక్షి?"

"నా సవతికూతురు."

"వయస్సు?"

"పంధొమ్మిది. ఈ సమయంలో నేను రావటం మీకు సంతోషం కలిగించటం లేదూ?"

"లేకేం! వస్తావని నేను అనుకుంటూనే వున్నాను."

బయట కురుస్తున్న వర్షాన్నిగురించి, అలా ఎడతెరిపిలేకుండా వర్షంకురిస్తే వరద వచ్చే ప్రమాదాన్నిగురించీ కొంచం సేపు మాట్లాడుకున్నాము. ఇలాంటి సమయంలో ఆమెను కారులో ఇంటిదాకా తీసుకువెళ్ళి దించిరావలసి వస్తుందేమో నని నాలో నేను అనుకున్నాను.

"ఇవ్వాళ మధ్యాహ్నం నాకు చిరాకు వేసింది," అన్నాను.

"చెడ్డచిరాకే వేసిందా?"

"మొత్తంమీద...కొంత..."

"నా స్థితి మీకు విచారం కలిగించటం లేదూ?"

"ఊ...లేకేం!"

"పెళ్ళి అయాక ఇంత బాధ ఇదివరకెప్పుడూ పడలేదు. అందుకే, ఇక్కడికి ఇలా వచ్చాను"

"ఏదో పెద్ద అవాంతరం వచ్చిపడ్డట్టు వర్ణించావే!"

"వర్ణించటంకాదు. నిజంగా జరిగింది. విపరీతమైన ఆలోచనతో నా తల తిరగటం మొదలుపెట్టింది. మనసును కలత పెట్టటానికి ఇది చాలదు?"

"ఏమిటది?"

"సూత్రప్రాయంగా చెపితే చాలనుకుంటాను."

"చెప్పదలచుకున్న విషయం నిజానికి ఏదైనా ఒకటి వుందా?"

"లేకపోతే ఇక్కడికి రావట మెందుకు? నేను చెప్పాలనుకున్న విషయం..."

"బాగా ఆలోచించి చెప్పు."

"మీరు నన్ను నమ్ముతారా?"

"ఒకసారి ప్రయత్నంచేసి చూడు."

"నా భర్తని నేను గాఢంగా ప్రేమిస్తున్నాను. పూర్వంకంటెకూడా ఆయన్ని ఇటీవలే ఎక్కువగా ప్రేమిస్తున్నానేమో ననిపిస్తోంది."

ప్రశాంతంగా వున్న బయటి వాతావరణంలోకి ఒకసారి చూశాను. ఆమెకు దూరంగా వుండాలనే భావం నాకు కలుగుతూంది. దూరంకావటం మంచిదే. అయితే అప్రయత్నంగానే నేను ఆమె దగ్గరదగ్గరికి చేరుతున్నానేమో ననిపించింది. ఆమె తన మనసులో ఉన్న విషయ మేదో నాకు స్పష్టంగా చెప్పటంలేదని నా హృదయం హెచ్చరిస్తోంది. ఆమెను నేను మొదటిసారి కలుసుకున్నప్పుడు కూడా, ఆమె బయటికి చెప్పిన విషయానికంటె ఆమె హృదయంలో ఏదోగంభీరమైనరహస్యాన్నే దాస్తున్నట్టు తోచింది. ఆమె విషయంలో నా అభిప్రాయం మార్చుకోలేకుండా వున్నాను.

"ఇటీవలేనా?" అన్నాను.

"ఔను ... ఆ ఊహే ఎంతో ఆవేదన కలిగిస్తోంది!"

"ఏమిటేకీ? గనులలో పనిచేస్తున్నపుడు వర్షంలో, రాత్రివేళ ఒక గడ్డ విరిగి ఆయన మీద పడుతుందేమో ననేనా?"

"మీరు ఆ మాట అనవద్దు."

"నీ భావం అదేకదూ?"

"ఔను"

"ప్రస్తుత పరిస్థితులలో ఇది సంభవమే"

"ఏమన్నారు? ఈ పరిస్థితులలో..."

"గడ్డ విరిగి మీదపడవచ్చు."

"మీరు అలా అనవద్దండి. ఇది పరాచకాలాడే విషయంకాదు. నాకు ఆవేదన కలిగిస్తోంది. మీకు అటువంటి అభిప్రాయం ఎందుకు కలిగిందో?"

"నీవే అతడిమీద పెద్దరాతిని దొర్లించినా..."

"నేను...ఏమి టన్నారు?"

"అది రాతిబండ కావచ్చు. ఇంకేదైనా ప్రమాదకరమైనదీ, ప్రాణం తీసేదీకావచ్చు. అప్పుడు మృత్యువు సంప్రాప్తిస్తుంది."

ఆమె ముఖం వెల వెల పోయింది! చూపులు, నిశ్చలంగా, ఏదో అన్వేషిస్తున్నట్టుగా కనుపించినవి.

తన మనస్సులో వున్న భావాన్ని కప్పిపుచ్చటానికి ఆమె ప్రయత్నిస్తున్నది. ఆమె హృద్గత భావాన్ని అనుకోకుండా, అకస్మాత్తుగా, మరొకరినోట వినేసరికి నివ్వెరపోయింది.

"మీరు నాతో వేళాకోళమాడుతున్నారా?" అంది.

"లేదు నేను చెప్పిందే నిజం. లేకపోతే అది నీ భ్రాంతి."

"నా జీవితంలో ఇటువంటి విషయం నేను వినలేదు."

"నేను వేళాకోళ మాడటంలేదు. నీ జీవితంలో ఇటువంటి విషయం వినలేదా? నన్ను కలుసుకున్నప్పటినుంచీ నీ హృదయంలో ఇదే భావం దాగివుంది. అందుకే ఈ రాత్రి నీవు ఇక్కడికి వచ్చావు?"

"ఈ మాటలు వింటూ నేను ఇక్కడ వుండటం నాకు ఇష్టంలేదు. వెడతాను."

"నిరభ్యంతరంగా."

"అయితే, వెడుతున్నాను."

"సరే."

—ఇంకా వుంది. ★

## ఆఖరు వైనం

(26-వ పేజీ తరువాయి)

తను ఏమీ చేయలేడు - నిర్మలమీద విరక్తి కల్గటం మినహా. కోపం ముంచుకొస్తోంది; ఐనా దిగ్రమింగి "ఇలా అపార్థం చేసుకుంటావనుకోలేదు నిర్మలా" అనిమాత్రం అనగల్గాడు. అంతే.

"మీరెన్నైనా చెప్పండి-స్త్రీ తన భర్త అలా పరాధీనంఅవటం సహించదు ... అందులో నేను అసలు సహించలేను," రోషంగా అంది. నిర్విణ్ణుడై పోయాడు. నవ్వుకూడా వచ్చింది-పొడిగా. నవ్వేశాడు.

ఇక తప్పదు, ఇంటికి వెళ్ళిపోవటం. కాపురం ఎత్తివేయడం తనకు ఇష్టమే; కాని యీ రూపంగా వెళ్ళిపోవటం నీచం; ఐనా తప్పదు అనుకున్నాడు. "కాని ఒక్కటే, ఆఖరిసారిగా పిలువు సీతని; పాపను చూపుదువుగాని" అన్నాడు. నిర్మలకూ ఒకసారి చూడాలనిపిస్తోంది. అందువల్ల అంగీకరించింది.

భోజనాలైనాక నిర్మలే స్వయంగా వెళ్ళి పిల్చుకువచ్చింది సీతను. రాగానే పాపను ఎత్తుకుని మనసారా ముద్దులుపెట్టుకుంటోంది సీత. నవ్వుతున్నాడు శివరాం. అది గ్రహించి ఊరుకుంది నిర్మల. ఆఖరుకి, వెళ్ళిపోతున్నామని చెప్పేసింది. చేతిలోఉన్న పాపను అలాగే హృదయానికి హత్తుకుని "ఏం?" అన్నట్లు ముఖంపెట్టింది అమాయకంగా. అందుకు సమాధానం ఇవ్వక పెట్టెలు సర్దుతోంది నిర్మల. ఆఖరిసారి అన్నట్లు చూశాడు. ఆ దివ్యప్రసన్నలతను-శివరాం. మ్చ్! ఏమి లాభం ఎంత గుణం, అందం ఉంటే మట్టుకేం?—బూడిదలో పాలుపోసినట్లేగా! వాళ్ళ బావ ఆ పిల్లను పెళ్ళిచేయడు; వాడి సంగతి తనకు తెలుసు. ఒట్టిపోకిరీ మనిషి. వాడే పెళ్ళిచేసుకుంటాడు ఖాయం. అలా వీలులేదని— ఆ అమ్మాయి తరఫున వాదించే నాథుడు లేడు. ఎప్పుడూ ఒకరి త్యాగం ఇంకొకరికి ఆనందం. త్యాగానికి అలాటి స్థానం ఉంది. అదే లేందే— మానవసమాజాలు ఇంతగా అల్లుకుపోయి ఉండేవి కావేమో! ఇందులో తన పాత్ర ఏమైనా దోష భూయిష్టమా?—లేదు. బానిసలపట్ల - కాదు, కాదు...అభాగ్యులపట్ల వ్యక్తిత్వం లేనివారిపట్ల—తనకు భగవంతుడు అనుగ్రహించినది ఒక్క సానుభూతే! సానుభూతిలో కరిగిపోతాడు. కాని, అందువల్ల జరిగిన పరిణామం యీసారి యిట్టిది, అని నిట్టూర్చాడు.

బండి వచ్చి ఇంటిముందు ఆగింది. పాపను తీసుకుని నిర్మల బండి ఎక్కి ఠీవిగా కూర్చుంది. శివరాం వెనకాలే ఎక్కి కూర్చున్నాడు. పాపవంకే చూస్తూ ఉండిపోయింది సీత. పాప కిచకిచలాడుతోంది. సీత ఆనందంగా కన్నీరు కార్చింది. ఆకళ్లు ప్రకాశించాయ్. నిర్మల గ్రహించలేదు: ముందుకు చూస్తూ ఉండిపోయింది. బండి కదిలింది. ఎంత ప్రయత్నించినా ఆపుకోలేకపోయాడు శివరాం-కళ్ళవెంట రాలే కన్నీళ్ళను.

బండి మలుపులు తిరిగి-రద్దీ బజారులు దాటి...పల్లెకోనకు వెళ్ళేమార్గం పట్టింది. వచ్చేప్పుడు నాన్నగారు చెప్పినమాటలు గుర్తుకొచ్చాయ్. శివరాంకి. వెంటనే నిర్మలవంక చూశాడు. "నేను మొదలే చెప్పలా! నీదంతా అపోహ! తోటివాళ్ళను అర్థం చేసుకోలేవు-సద్దుకుపోలేవు "అనీ"—గొణిగాడు. ఆ మాటలు వినిపించుకోలేదు నిర్మల అత్తగారి సరసన ఆనందంగా ఉండాలనే ఉబలాటంతో వుంది. ★

# మంత్రాలు: నమ్మకాలు

## మంత్రాలను రిసెర్చిచేసి చర్చించాలి

జనవరి 2 వ తేది వారపత్రికలో శ్రీ జి. వాసు - [మద్రాసు] ప్రకటించిన అభిప్రాయము లన్నింటితోను నేను యేకీభవించు చున్నాను. గతాను గతికోలోకః అన్నట్లు ప్రజలు యెవరో చెప్పునది తమకు తెలిసినట్లు ప్రచారముచేయుట తప్ప, ఆ చెప్పునది రీసెర్చి భావముతో ఆలోచించే వారు మనదేశములో చాల తక్కువ, ఆ కారణముచేతనే కొంతమంది విదేశీయులు హిందూదేశస్థులు మూఢనమ్మికగల ప్రజలని నిందించు చున్నారు.

ఒకపాము మంత్రవేత్త చెప్పిన విషయ మిది. కొంతమంది హరిజనులు ఒకరాత్రి ఊపిలతో చేపలను పట్టుకొను చున్నారట. అందులో ఒకతనికి త్రాచుపాము దొరకినదట. అది మలుగుపాము అనేచేప అని సంతోషపడి దానిని బుట్టలో వేసుకొన్నాడట. దానిని లాగి బుట్టలో వేసుకొనుటలో అది అతనిని చాలచోట్ల కరచినది. తెల్లవారు ఝామున 4 గం॥ లకు పని పూర్తిచేసుకొని భార్యకు ఆబుట్టయిచ్చి తాను పొలముపనికి వెళ్ళిపోయెనట. తెల్లవారిన తరువాత భార్య బుట్టవిప్పి చూస్తే దానిలో త్రాచుపాము యున్నది. ఆమె పాముఅని కేకలు వేయగా చాలమంది చేరి దానిని చంపివేసిరి. ఇంతలో పాముచే కరవబడ్డవాడు వచ్చి అంతయు తెలుసుకొని తన చేతిమీదవున్న కాట్లు చూచుకొని రాత్రి తనను కరచినది ఆపామే యని కంగారుపడి స్పృహతప్పి పడిపోయినాడట. అప్పుడు ఆగ్రామములోనే యున్న పైమంత్రవేత్తను తీసుకువచ్చి యెన్ని మంత్రములు వేసినను ఆవ్యక్తి బ్రతకలేదట. యెంతోమందికి మంత్రములువేసి బ్రతికించినాను కాని ఆవ్యక్తిని మాత్రము బ్రతికించలేక పోయినానని ఆమంత్రవేత్త మాతో చెప్పినారు. కారణము విషము యెక్కువగా రక్తములో ప్రవేశించుట అయివుంటుంది. అసలు త్రాచుపాము కరిస్తే మనిషి చచ్చిపోవుటకు కారణము రక్తము చిక్కబడి పోవుట. . దానికి మంత్రముయెట్లు పని చేయునో తెలియకున్నది.

రక్తము చిక్కబడిపోకుండా విరుగుడుకు మందులు యిస్తే మనిషి బ్రతుకును. కొన్ని మూలికలు కలవు. ప్రస్తుతము బొంబాయిలో Haffkine Industries వారు పాము విషముతోనే యింజెక్షనులు తయారుచేయుచున్నారు. అంతే కాని మంత్రమునకు పాము విషము తగ్గుననేది నమ్మతగ్గ విషయముకాదు,

తేలుకాటుకు మంత్రము అనేది అసలు అబద్ధము. నాకు అనేకసార్లు కుట్టినది. మంత్రములు గాని మందులుగాని పనిచేయలేదు. నేను చూచినంతవరకు యితరులకు కూడా పనిచేయలేదు.

నాచిన్నతనములో ఒక భూతవైద్యుని వద్దకు ఒకరి వస్తువులు పోవుటచే అంజనము వేయించి దొంగిలించిన వారిని తెలుసుకొనవలెనని వచ్చిరి. అప్పుడు ఆవైద్యుడు అంజనము నాకు వేసెను. కాటుకమసి అరచేతిలో సంప్రేమముగా వ్రాసి అరచేతిని ఆముదపు దీపమునకు యెదురుగా వుంచమన్నాడు. దీపపు కాంతులు ఆమసిలో తళ తళ మెరయుచున్నవి. ఆకాంతులు లెక్కపెట్ట మన్నారు. కొన్ని లెక్కపెట్టితిని. మరల లెక్కపెట్టమన్నాడు. కొన్ని యెక్కువ చెప్పితిని. మరల లెక్కపెట్టమన్నారు. మరి కొన్ని యెక్కువ చెప్పితిని. ఆ కాంతుల మధ్యనుంచి 'నివున్ను నీకు తోడుగా మరొక పిల్లవాడున్ను కలసి వెళ్ళుచున్నారు చూడు' అని ఆ వైద్యుడు అన్నాడు. కనబడక పోయినప్పటికి ఆవైద్యుడు యేమైనా తిట్టునేమో అనే భయముచేత 'వెళ్లుచున్నాము' అంటిని. అతడు భూతవైద్యుడగుటచే అతనంటే మాకు చిన్నతనములో చాల భయము. నిజముగా యేమైన భూతములను మామీద విడిచిపెట్టునని మేము ఝడిసేవారము. తరువాత 'మీరు యిద్దరు కలసి కొలనువరకు వెళ్ళినారు. చూడు' అని అన్నాడు 'వెళ్ళినాము' అని అన్నాను. అక్కడనుంచి కొన్ని కొన్ని గ్రామములు చెప్పుతూ 'విప్పర్రు అనే గ్రామము వెళ్లినారు చూడు' అనిఅన్నాడు. 'వెళ్లినాము' అని అన్నాను. 'అక్కడ బల్లకట్టు వుంటది చూడు' అన్నారు. వున్నదన్నాను. 'బల్లకట్టు దాటి ఊళ్లోకి వెళ్లతారు చూడు' అన్నాడు. ఆ గ్రామములో ఒక స్త్రీ ఆ వస్తువులు దొంగిలించినదని ఆ వచ్చినవారి అభిప్రాయము. ఆ అనుమానమును బలపరచుటకు ఆ వైద్యుడు 'ఒక ఆడమనిషి కనిపిస్తది చూడు' అన్నారు. కనిపించుచున్నది అన్నాను. గాజులున్నవా అని అడిగినారు. నాకు యేమిచెప్పుటకు తోచక నాకు యేమీ కనిపించుటలేదని చెప్పినాను. నా పరిస్థితి గ్రహించి యింకనూ యీ విధముగా మాట్లాడితే తన గౌరవము పోవునని ఆ వైద్యుడు ఆ అంజనము మరొకపిల్లవానికి వేసినాడు. నిజముగా మొదటినుంచి నాకు యేమియున్నీ కనిపించలేదు. అంజనములో సత్యముంటే నాకు యేమి కనిపించుచున్నదో నన్నే అడిగి తెలుసుకోవాలి గాని అన్ని ఆయనే చెప్పితే సత్యము యెట్లు తేలును?

నాకు సుమారు 3సం॥నుంచి చెవి హోరుగా యుంటున్నది. ఒక పాము మంత్రగానివద్ద నేను పాముకు మంత్రములేదనివాదిస్తే నా చెవి హోరుకు మంత్రము వేసి 8 రోజులలో తగ్గించెదనని సవాలుచేసినారు. నాకు నమ్మకము లేనప్పటికి మంత్రము యెంతవరకు నిజమో తెలుసుకోవలెననే ఆతురతతో మంత్రము వేయించుకున్నాను. పది రోజులు వేసినారు. కాని హోరు తగ్గలేదు. దానికి ఆయన చిన్నబుచ్చుకుని పాము మంత్రములోనే తనకు యెక్కువశక్తి కలదని తప్పించుకున్నాడు. ఆ మంత్రము వేయించుకుని యిప్పటికి 1½ సం. అయినది. హోరు మాత్రము యింకనూ తగ్గలేదు. నేను అక్కడ యుండగానే ఒక పిల్లవానిని పాము కరచుటచే తీసుకువచ్చినారు. వారు మంత్రములు వేసినను పిల్లవాడు బ్రతకలేదు. నేను అడిగితే అప్పటికే ఆ పిల్లవాడు చనిపోయినాడని జవాబు చెప్పెను.

మంత్రములయందు నమ్మకముగలవారు ఆ మంత్రములను రిసెర్చి భావముతో పరీక్షించవలెను. కొన్ని వ్యాధులు మంత్రము కాని మందులుకాని వేయకుండా వాటంతట అవే తగ్గిపోవును. మంత్రము వేయించిన తరువాత తగ్గితే తగ్గుటకు మంత్రమే కారణమని చాలమంది నమ్ముదురు. కాబట్టి యీ ప్రత్యక్ష ప్రపంచములో సైన్సు యింత వృద్ధి అయిన రోజులలో యిట్టి మూఢనమ్మకము

# ★ మంత్రాలు, నమ్మకాలు ★

లకు తావులేదు. గాన యదార్థవిషయములనే ప్రజలు నమ్మెదరని ఆశించుచున్నాను.

చవటపల్లి లక్ష్మీనరసింహం,
—పాలకొల్లు.

* * *

## మంత్రాల కరణంగారు

మా వూరు వేళంగి, కాకినాడకు 10 మైళ్ళలో వున్న గ్రామం. మంత్రాల కరణంగారంటే మా వూరు ప్రాంతాల గ్రామాలన్నిటికీ కూడా, కొత్తకాదు. మావూరికి యిద్దరు కరణాలు. అందులో ఒకాయన పేరు కూరపాటి నరశింహారావు గారు. ఆయనే మంత్రాలకు ప్రసిద్ధి. కాని ప్రజలు ఆపేరుతో పిలువరు, మంత్రాల కరణంగారని పిలుస్తారు.

ఆ కరణంగారి తాతముత్తాత లందరూ ఆదినుంచీ మంత్రాలకు ప్రసిద్ధిపొందినవారే. అందులో ముఖ్యంగా యీయనతాత కామరాజుగారు పాము, సర్పి యింకా పురుగులకు సంబంధించిన మంత్రాలన్నిటికి గూడా మా తాలూకా కంతటికి పేరు మోసిన వారు. ఈ కామరాజుగారి పాము, తేలు మంత్రాలు చాలా గమ్మత్తుగా వుండేవట. ఆయనదగ్గర ఒక వంకీబెత్తం వుండేదట. పాముకరచినవాడెవడైనావస్తే వాణ్ణిదగ్గరకు పిల్చి 'పాము నిన్ను కాదురా కరుస్త, బెత్తాన్ని...' అంటూ ఆ వంకీబెత్తంతో వీపుమీద నెమ్మదిగా కొట్టేవారట. ఏడుపు ముఖంతో వచ్చిన అవ్యక్తి నవ్వుతూ పోయే వాడట.

అవి తెల్లదొరల పరిపాలన దినాలు. అప్పట్లో ఒకసారి "మోర్" అనే ఒక పోలీసు అధికారికి కాకినాడలో క్యాంపు చేసి వుండగా నల్లత్రాచు కరచిందట. ఆయన ప్రాణంపోయేస్థితిలో వుండగా ఆయన బంధువు ఒకడు కామరాజుగారి సంగతి తెలిసి కారుమీద శరవేగంతో మావూరు వచ్చి కరణంగార్ని మంత్రనిమిత్తం కాకినాడ రమ్మనమని కోరేరట. దానికి కరణంగారు నిరాకరించి ఆయన్నే తనదగ్గరకు తీసుకు రమ్మన్నారట. విధిలేక ఆదొర తిరిగి కాకినాడపోయి చచ్చేస్థితిలో వున్న చుట్టాన్ని కారులో పరుండబెట్టి మావూరు తీసికొచ్చారట. అప్పుడు కామరాజుగారు చిరునవ్వుతో "ఈ పిల్లదొరనికరిస్తే లాభమేమిటే? పాలించే ఆ పెద్దదొరల్ని పట్టుకోకక?" అని చేతిని మంత్రంతో వూది కుట్టినచోట కొట్టారట. ఆమాటలు విని అక్కడకు చూడ్డానికివచ్చిన జనం అంతా విరగబడి నవ్వేరట. తెలుగుతెలియని ఆతెల్లదొరలు కామరాజుగారి యీమాటలు అర్థంకాక ఇంకా తెల్లమొహాలు వేశారట. కొంతసేపటికి మోర్ దొరగారు స్పృహవచ్చి లేచి కూర్చొని సంభ్రమానందాలతో కొంత డబ్బు, స్వదస్తూరిలో ఒకసర్టిఫికేట్ రాసి కామరాజుగారికి యివ్వబోయారట. అవి తన మంత్రశక్తికి విరుద్ధాలు అని చెప్పి కామరాజుగారు త్రోసిపుచ్చారట. తరువాత ఆదొరలు ఆయన్ని వేనోళ్ళపొగడి తిరిగి కాకినాడకు పోయేరట. ఇలాగే, ఆయన ఎందరినో క్షణకాలంలో తమ మంత్రశక్తి వల్ల బ్రతికించేరట. ఆయన సర్పిమంత్రాలకి ఎందుచేతనోగాని ఎక్కువగా ప్రసిద్ధిపొందలేదు. తరువాత ఆయన కొన్నిరోజుల్లో పోతాడనగా తన మనుమడైన యిప్పటి కరణంగారికి అ మంత్రాలన్నీ సక్రమరీతుల్లో చెప్పి వాటి పటుత్వానికి కావలసిన నియమాలు, నిష్ఠలు, ప్రతిదిన పూజావిధానం చెప్పి దివంగతులయ్యేరట.

ఇక యిప్పటి కరణంగారి విషయం అతిగా చెప్ప నవసరంలేదు. ఆయన తిరిగి తాతగార్ని తు. చ. తప్పకుండా పోలినవారనే చెప్పొచ్చు. ఎటొచ్చీ తాతగారు పాము మంత్రంలో గొప్పపేరు సంపాదిస్తే యీయన సర్పి, పసుమంత్రాలలో ఎక్కువ పేరు ఆర్జించేరు. కరణంగారి యింటికి రోజూ ఎవరో ఒకరు మంత్రానికని వస్తూనే వుంటారు. ఆయన ఏవిధంగా కూడా వారి దగ్గర్నుంచి వీసం ఎత్తైనా ప్రతిఫలం స్వీకరించరు. ఆయనమూలమున మా గ్రామంలోనేకాక, పరిసర గ్రామాలలోకూడ అనేక పసువులు "పురుగువాత" లనుండి రక్షింపబడ్డాయి. ఎటువంటి నయముకానేరని సర్పి వ్యాధులైనా, పసువులకు పురుగు ముట్టుకోడం వల్ల వచ్చే ఎటువంటి వ్యాధులైనా సరే రెండు రోజుల్లో నయం చేస్తారు.

ఈయన మంత్రంతోపాటు పసర్లుకూడా యిస్తారు. పాము మంత్రంలో కూడా యీయన తీసిపోలేదు.

కొన్ని సంవత్సరముల క్రితం యీయన ఒక కొండజాతి నాయకుడిదగ్గర భయంకర సర్పాల కాట్లకు ఒక మంచి మంత్రం నేర్చుకొన్నారట. ఒక రోజున హైవేస్ డిపార్టుమెంటులో ఒక వున్నతాధికారి. పొడపాము పూదుటవలన శరీరమంతా వాపు బాధలతో ఎక్కడా నయమువక యీయన సంగతి తెలిసికొని యీయన దగ్గరకు రాగా కరణంగారు స్నానంచేసి దీక్షగా ఒకగంట మంత్రం జపించి ఆ రోజునే తిరిగి ఆయన్ని మామూలు మనిషిగా చేసి పంపించేసేరు.

కె. రామలక్ష్మి —వేళంగి
[తూ. గో. జిల్లా]

* * *

## పాము మంత్రము

నేను చిన్నప్పుడే, అనగా ఐదవతరగతి చదువుకొనున్నప్పుడే ఒక పాము మంత్రము నేర్చుకొన్నాను. అంటే మంత్రము మాత్రము నోటికి నేర్చుకొన్నానని కాదు. 2008 సార్లు జపంకూడ చేశాను. ఉదయం 8 గంటల నుండి సాయంత్రం ఆరువఱకు వచ్చే నీటిలో నుంచుని చేశాను. తరువాత మంత్ర ప్రయోగం కూడ చేశాను. ఒక రోజున హఠాత్తుగా మా యింట్లోకి నాగుబాము వచ్చింది. మాది పల్లెటూరు. చుట్టూ చేలు, కల్లలుయుం[illegible]వను త్రొక్కని ఇసుక తెప్పించి మంత్రించి పాము మీద చల్లాను. పాము తెలివి తప్పినట్లు పడి పోయింది. అప్పుడు పామును ఇష్టము వచ్చిన తావున పట్టుకొన్నా కఱువదని మా గురువు గారు చెప్పినారు. కాని నాకు ధైర్యము కలుగలేదు. కఱ్ఱతో పైకెత్తి బయట వదలినాను: 15 నిముషములట్లే పడియుండి తరువాత వెళ్ళిపోయింది.

ఈ మంత్రము నాకింకను నోటికివచ్చును. ఎందుకంటే పైవిధంగా ఆదివారమమావాస్య నాడు, సూర్యగ్రహణము నాడు రెండు పర్యాయములు జపంచేస్తాను గావున. ఒక పర్యాయము రాత్రులలో జపం చేయడానికి మా మామగారితో కలిసి వెళ్ళినాను. ఆయన కంటే నేనే చాల తొందరగ ముగించాలని ప్రయత్నించాను. చాలవఱకు విజయం పొందినట్లే భావించాను. కాని సుమారు నూరుసార్లున్నది యనగా నాకు మతిపోయినట్లయింది. మంత్రం పూర్తిగా నోటికి రాలేదు. ఎంతో ప్రయత్నించాను. ఫలితం లేకపోయింది. జపం పూర్తిగ నిలిపివేయవలసి వచ్చింది. తుదకు మా మామగారు ముగించి నాకు చెప్పినాకూడా జపంచేయుట కష్టమయింది. ఆ స్థలం వదలి సుమారు, మైలుదూరం పోయిన తరువాత జ్ఞాపకం వచ్చింది. నాకిప్పుడూ ఆమంత్రం జ్ఞాపకం ఉంది. కావలిస్తే ఎవరయినా పరీక్షించండి.

"హరి హరె సాంపు దంత ఒక పాట
పుల్లాటి
జుచ్చాలు యొకండి హ హిఱు సాంపు
సాంపు
సాంపూరే జిమ్మికాంతిని ఈశ్వరి
మహాదేవి కాలాగ్ని నిలు, నిలు, నిలు."

గొంతు వఱకు వచ్చే నీటిలో ఆదివార మమావాస్య నాడయినా లేక సూర్యగ్రహ

(56-వ పేజీ చూడండి)

# వనితా లోకం

## మంచీ చెడ్డా:

# ఆవుపాలు

"తల్లిపాల తరువాత ఆవుపాలే బిడ్డలకి సర్వశ్రేష్టం" అని అంతా చెబుతారు. ఆవుపాలను గూర్చిన కొన్ని అనుభవాలను వ్రాస్తున్నాను. నా కుండేటటువంటి అనుమానాలను, భయసందేహాలను, శ్రీమతి భైరవిబొట్ల లీలా సీతారామ్ గారు కాని లేక సమర్థులైన మహిళలుగాని, తీర్చగలరని ఈ వ్యాసాన్ని వ్రాస్తున్నాను.

"ఆవుపాలే బిడ్డలకి మంచివి. ఆవుపాలు అమృతోపమానమైనవి" అని అంతా అంటారు. కొన్ని అనుభవాలు నన్ను అలా అనుకోకుండా చేశాయి. డబ్బాపాలకంటే తాజాఅయినవి మంచి విటమిన్స్ ఉంటాయి ఆవుపాలల్లో. ఇవన్నీ అంతా ఒప్పుకొనే విషయాలే. ఆవుపాలు పట్టితే బిడ్డలు ఏపుగా ఎదుగుతారు. బలంగానే వుంటారు.

కాని, ఆవుపాలు ఆహారంగాయిచ్చే పిల్లలకు లివర్ వచ్చే అవకాశాలున్నాయని నా అనుభవాలు చెప్పాయి. కొందరికి ఏమీ చేయకపోవచ్చు.

మేము ఏడుగురం అక్కచెల్లెళ్ళం, ఇద్దరు తమ్ముళ్లున్నారు. మా అమ్మగారు మా అందర్కీ ఆవుపాలే ఇచ్చారు. మాకేమీ కాలేదు. నేటికాలంలో అవి అందర్కీ సరిపడ్డంలేదు. మా పిన్ని తన యిద్దరి బిడ్డలకూ ఆవుపాలే ఆహారంగా ఇచ్చింది. ఇద్దరూ లివర్ జబ్బుతోనే మరణించారు. మూడవ బిడ్డకుకూడా ఆవుపాలే పట్టమని మా కుటుంబవైద్యుడు సలహా ఇచ్చారు. ఏమైనాసరే ఈ పర్యాయం ఆవుపాలు పట్టవద్దనీ, ఆహారం మార్చమనీ మా పిన్నికి నచ్చచెప్పాను. ఆమె గ్లాస్కో వాడింది. ఆ బిడ్డ ఆమెకు దక్కాడు.

తరువాత నాకు వివాహం జరిగి ఒక అమ్మాయి పుట్టింది. పిన్ని విషయంలోని అనుభవం గుర్తున్నా, అందరికీ అలా ఎందుకు జరుగుతుందని నేనూ ఆవుపాలే వాడాను. నీళ్ళూ పాలూ కలిపే వాడాను. కాని ఆ బిడ్డ మూడవసంవత్సరం ప్రవేశించంగానే అదే జబ్బుతో చనిపోయింది. డాక్టర్లవల్లా వైద్యంవల్లా ఏమీ లాభం లేకపోయింది.

లివర్ జబ్బు రానంతవరకు నా బిడ్డ బాగానే వుండేది. పుష్టిగా, ఆరోగ్యంగా, మరే వ్యాధులూ దానికి రానేలేదు. పోనీ మరే ఆహారంవల్లనైనా ఆ జబ్బు వచ్చిందేమో అంటే ఆవుపాలు తప్పించి ఆఖర్కి చిన్న పిప్పరమెంట్ కూడా తిని ఎరుగదు.

ఆ తరువాత నే ఎరుగున్న ఇద్దరు మిత్రురాండ్ర పిల్లలు అదే ఆహారంమీద పెరిగి, అదే జబ్బుతో చనిపోయారు. ఆవుపాలు ఆహారంగాఇచ్చిన మరో అమ్మాయికి కూడా లివర్ వచ్చి చాలా కష్టంమీద బ్రతికింది. మా ఆడబిడ్డ, ఆవుపాలు చాలా మంచివని వాడారు. ఆ పిల్లకూ లివర్ వచ్చినా అదృష్ట వశాత్తు రక్షింపబడింది. ఇటీవల ఒకరిద్దరు మా యింటికి వచ్చిన మహిళలు తమ పిల్లలు లివర్ జబ్బుతో మరణించినట్లు చెప్పారు.

"ఏంపాలు పోశారు. ఆవుపాలా" అని నేనడిగితే వారు తెల్లబోయి అవునన్నారు. ఆమాట విని నేను తెల్లబోయాను...

లివర్ జబ్బు రావడానికి అనేక కారణాలు వుండొచ్చు. అ కారణాల్లో ఆవుపాలు కూడా ఒక కారణం కావడం నేను చూశాను. విన్నాను. అనుభవించాను. ఇది నా భ్రమ అనేకంటే సర్వశ్రేష్టమైన ఆవుపాలవల్ల అలా యెందుకు జరుగుతోందో ఎవరైనా శాస్త్రజ్ఞులు, వైద్యులు పరిశోధించి కారణాన్ని తెలుసుకుంటే బాగుంటుంది.

ఎ. వి. రమణమ్మ (హౌరా)

అసలు లివర్ జబ్బు ఏ కారణాలవల్ల వస్తుంది? అది రాకుండా, ఎలా జాగ్రత్త పడాలి అనే విషయాలు ప్రతీ మహిళకూ తెలియపరచాలి. ఈ జబ్బులో అనేకమంది పసిపిల్లలుమృత్యువువాత బడుతున్నారు.

ఇదిచదివి ఆవుపాలు వాడే వారంతా అనుమానభయాలు పెట్టుకోవద్దు. ఆవుపాలు వాడేతల్లులు అందరూ గ్రహించవలసిన విషయాలు.

ఒకటి: నమ్మకమైన ఆవుపాలు కావాలి. అవి మన ఎదురుగుండా పితికినవై వుండాలి.

రెండు: ఆవుయొక్క ఆరోగ్యం ఆహారం గమనించడం మంచిది. మహాపట్నాల్లో ఆవులకు తెలకపిండి వగైరాలు జోరుగా వాడతారు, పచ్చగడ్డి అపురూపంగా వుంటుందక్కడ.

ఇక ఆవుపాలల్లో ఎక్కువనీరు కలపకూడదు.

"ఆవుపాలు బలమైనవనీ. నీళ్లెక్కువపోస్తే సులభంగా జీర్ణమౌతాయని, కొందరు చెబుతారు. ఇది పొరబాటు. నీళ్లు ఎక్కువ కలపడం వల్ల మంచి ఫలితాలకంటే చెడ్డఫలితాలే రావచ్చు. డబ్బాపాలు పిండిగా మార్చబడతాయి. ఆవుపాలల్లో సహజంగానే నీరు ఎక్కువ వుంటుంది. కాబట్టి నీళ్లు స్వల్పంగానే కలపాలి. పాలు ఇవ్వడంలో మూడునాల్గుగంటల వ్యవధి వుండాలి. రాత్రి 10 గంటలు దాటాక పాలు పట్టరాదు.

సహజంగానే ఆవుపాలు రుచిగా వుంటాయి. కాబట్టి పంచదార వగైరాలు కలపకుండా పట్టి అలవాటుచేయడం మంచిది. పిల్లలు మరీమారాంచేస్తే పటికపంచదారవాడ్డం మంచిది.

పాలు గిన్నెల్లోకాక కుండల్లో కాచడం మంచిది. సన్నటి సెగను కాచడం మంచిది. పాలు బొత్తిగా చల్లారినవి కాక గోరు వెచ్చనివి వాడాలి.

ఆవుపాలల్లో జిడ్డు వుంటుందనీ, అది



# అలంకరణలో పాతకొత్తలు


జమ్మి సుశీలారాణి

(గుండుగొలను)


సహజంగా ఉన్న అందాన్ని ద్విగుణీకృతం చెయ్యటానికి "అలంకరణ" తోడ్పడుతుంది. స్త్రీలకి అలంకరణప్రియత్వం సహజగుణం. ఆకర్షణీయంగా అలంకరించుకొని సౌందర్యాభివృద్ధి చేసుకోవాలని ప్రతిస్త్రీ వాంఛిస్తుంది. అలంకరించుకోవటంలోని కొత్త పద్ధతులకోసం తాపత్రయపడుతుంది.

ఈనాడు ఫాషన్స మహావేగంగా మారిపోతున్నాయి. దుస్తులు ధరించే తీరు, నగల ధారణ మొదలైనవి చెప్పలేనన్ని రకాలుగా మారుతున్నాయి. ప్రాచీనకాలంలో స్త్రీలు మొదలైనవారు ధరించినవి ఒక తీరు, తరువాత తరువాత మన పెద్దవాళ్లు అంటే అమ్మమ్మలూ నాయనమ్మలూ ఒకతీరు, పదిపన్నెండేళ్లీ మధ్య ఒక తీరు, నవీన అలంకరణ ఒక విధం.

మొదట నగల విషయమే తీసుకుందాము. ఈ నగలు పూర్వపువే కొంచెం కొంచెం మార్పులతో ఫాషన్ అవుతూ వస్తున్నాయి. "నగలుధరించుట భర్తకి ఆయురభివృద్ధికరము" అని పింగళి సూరన సృష్టించిన సుగాత్రి అనుకుంటుంది. అయితే ఆమె నిరాభరణత్వమే వాంఛించాడు ఆమె భర్త శాలీనుడు. మొత్తానికి సారీలోకానికి నగల మీద ఉండే ప్రీతి అంతా యింతా కాదు. అమరావతి అజంతా మొదలైన శిల్పాలలో ఈ నగల రకాలన్నీ కన్పిస్తాయి. మన భారతీయ ఆభరణాలు చాలా అందమైనవి, విలువఅయినవీ కూడాను.

పూర్వం ఆ పాదమస్తకం ధరించేందుకు వివిధ రకాలైన ఆభరణాలు ఉండేవి. వాటి పేర్లు కూడా చిత్రంగా వుంటాయి. కళాపూర్ణోదయంలో మధురలాలస పెండ్లి కుమార్తెఅయినప్పుడు ధరించిన ఆభరణాలు చూడండి. కాలిప్రేళ్ళకు మట్టెలు, పిల్లాండ్లు బబ్బిలికాయలు, వీరముద్దియలనే కాలిబొటన ప్రేలి ముద్రికలు, అందెలు ధరించి



కేశాలంకరణం

చిత్రకారుడు: వెల్లటూరి పూర్ణానందశర్మ.

---

కొందరు జీర్ణంచేసుకోలేరనిన్నీ ఆ జిడ్డు అనగా పచ్చిపాలమీద వెన్న చిలకరించి తీసేసి కాచిపడితే ఏజబ్బూ రాదనీ మా డాక్టరు చెబుతారు. అలా వెన్న తీయడానికి ప్రయత్నిస్తే రాలేదు మాకు. మరే విధానం వల్లనైనా తీయడం అందరికీ అందుబాటులో వుండదు. మిగతా విషయాల్ని ఆచరణలో పెట్టొచ్చు. ఆవుపాలు త్రాగే పిల్లలు ఏపుగా పుష్టిగానే పెరుగుతారు. అయినా వారిపై ఓ కన్ను వేసి వుండటం మంచిది. తెల్లగా విరోచనం అయితే డాక్టర్ సలహా వెంటనే తీసుకోవాలి. ఆవుపాలు పోసే పిల్లలకు పండురసం కొద్దిగా యియ్యడం మంచిది.

ఇందులో వ్రాసినవన్నీ జరిగిన విషయాలు. బిడ్డల పెంపకం విషయంలో సమర్థులైన మహిళలద్వారా నా బోటి మహిళలకు అమూల్యమైన సలహాలు లభ్యపడగలవనే ఆశతో ఈ అనుభవాలను వ్రాసినాను. ★

# ★ అలంకరణలో పాతకొత్తలు ★

నది. నడుమున మొలనూళ్లు, వడ్డాణము, మెడలో పుంజాలదండ, బన్నసరము, అణిముత్యాల పేరు, మొగపు తీగె, సందిదండలనే భుజకీర్తులు, చేతులకు నూడిగములు (గాజులు), కడియాలు, చెవులకు గౌడసరములు (చెంపసరములు) చెవులపూవులు, బవిరలు, కోలాటకమ్మ జోడు, ముక్కుకు ముంగర, పాపటబొట్టు, కొప్పువల - ఇన్ని ధరించిన ఆమె సౌందర్యం అద్వితీయం కాగా, తల్లి భయపడి దృష్టి తీసిపారవేస్తుంది ఆమెకు. వాల్మీకి రామాయణంలోనూ, బాణుని కాదంబరిలోనూ "పాంజీలు" అనే కాలి ఆభరణాల ప్రసక్తి వస్తుంది. పెద్దన మనుచరిత్రలో మనోరమను, పెండ్లికి అలంకరించుకున్నపుడు మణిపారిహార్యములు (కంకణాలవంటి ఆభరణాలు), రశన అనే పదహారు పేటలుగల మొలనూలు ధరించినది. ఈ మొలనూలు గొలుసులవలె నుండి పేటలు కలిగి ఉండేది. మనోరమకు తండ్రి అరణమిచ్చిన ఆభరణాలలో తులాకోటి(అందెలు) కంఠిక (కంటెలు) కూడా ఉన్నవి.

తెనాలి రామకృష్ణుని పాండురంగ మహాత్మ్యములో, నిగమశర్మ వృత్తాంతములో నిగమశర్మ తస్కరించుకుపోయిన నగలలో 'హరిసుదర్శనపు పేరు' అనే ఆభరణంవుంది. కళాపూర్ణోదయంలో సుగాత్రి 'ముళ్లె పేరు' అనే ఆభరణం ధరించినది. మధురలాలస పసిపాపగా నున్నప్పుడు పులిగోరు, సంకులు (శంఖాల కంఠమాల), బొద్దులు (గాజులవంటివి), రావిరేక ధరించినది. శ్రీకృష్ణదేవ రాయలవారి ఆముక్తమాల్యదలో గోదాదేవి నాసామణి (ముక్కెర) ధరించింది.

వీటిల్లో చాలామటుకు నగలు మన పెద్దవాళ్లుకూడా పెట్టుకున్నారు. కాలికి మట్టెలు, పిల్లాండ్లు,వెండికడియాలు, గొల్సెపు గొలుసులు, పట్టీలు, మొలకి వడ్డాణాలు మెడలో చంద్రహారాలు, పలకసరులు, కాశీకాయ గుండ్లదండలు, గజ్జెల పట్టెడలు, ముత్యాలు, పగడాలు, శంఖాల తావళాలు, కాసులపేరు వరహాలపేరు, కంటె, చెవులకి రాళ్లదుద్దులు, బొగడలు (ఇవి చెవి పైభాగాన ఉండేవి) బావిలీలు, చెంపసరాలు, ముక్కుకి అడ్డబాసలు, ముక్కుపుడకలు, చేతికి గాజులు, కట్టువంకీలు, తలమీదచంద్రవంక, రావిరేక, జడబిళ్లి, నాగరం, రాగిడీ, పాపిట పింద్రీలు ధరించారు.

పూర్వం చెవులకి రకరకాల కమ్మలేకాక రంగురంగుల తాటాకులుకూడా పెట్టుకునేవారు. కాదంబరిలో కాదంబరి చెవులకున్న మరకత మాణిక్య కుండలాలలో ఉత్కృష్టమైన తాటాకు పొదిగారుట. ఈ 'తాటాకు' వలననే చెవి కమ్మలకు 'తాటంక'? శబ్దం వచ్చిందేమో! 'కర్ణిక' అనే చెవిఆభరణానికి అర్థం, చెవిలక్కాకు అనికూడా వుంది. అంటే లక్కపూసిన తాటాకుట. కుమారసంభవమ్‌లో కాళిదాసు "కర్ణావసక్తామల దంతపత్రమ్" అన్నాడు. అంటే చెవియందున్న తెల్లని దంతపు భూషణం అని. అప్పట్లో వారు చెవియందు పువ్వులు కూడా ధరించేవారు. పార్వతి ముంగురులందు పెట్టుకున్న క్రొత్త కొండగోగుపువ్వు జారిపడినట్లూ చెవిలోని లేతచిగురు వాలిపడేట్లూ వంగి, శివునికి నమస్కరించిందన్నాడు కాళిదాసు. అల్లాగే శ్రీహర్షుడు నైషధకావ్యంలో "శ్రవణపూర తమాల దళాంకురం" (చెవిలోని లేత దరిసెనపూవు) అని వర్ణించాడు. మన అమ్మమ్మలూ వాళ్లూ రంగురంగుల రాళ్లున్న కమ్మలే ధరించారు. ఇక మొన్న అమ్మాయి అందరూ వేలంవెర్రిగా ధరించిన లోలాకులు, జూకాల రకాలు అన్నీ యిన్నీ కావు. రకరకాలు వచ్చాయి. ఇప్పుడవన్నీ పోయి రింగులు, ముత్యాలు క్రిందికి వేలాడే దుద్దులు ఇట్లా రకాల దుద్దులే ఫాషన్‌గా వున్నాయి. మన పెద్దవాళ్లు ఎఱ్ఱరాళ్లున్న జిగినీగొలుసులు పెట్టుకుంటే మనం రాళ్ల నెక్లెసులు పెట్టుకుంటున్నాము. ఈ మధ్య సన్నజాజి, మల్లెమొగ్గల షేప్స్‌లోనూ మామిడి పిందెల షేప్‌గల బంగారపు నెక్లేసులు ఫాషన్ అయాయి. కాని ఇటువంటి మొగ్గల ఆకారములు, గంటాకారములు, ఆకుల ఆకారముగల హారాలు వెయ్యేళ్లనాటి ప్రజాజీవితాన్ని ప్రతిబింబింపచేసే వింధ్యప్రదేశ్ ఆలయాలైన ఖజురహో శిల్పకళయందు కనబడుతున్నవని శ్రీ హెచ్. ఆర్. శేషగిరి రావుగారు జూలై 8వ తారీకు ఆదివారం ఆంధ్రపత్రికలో వ్యాసంలో వ్రాశారు. కనుక పూర్వపునగలే కొద్ది మార్పులతో వస్తున్నాయని గ్రహించవచ్చును.

మన పెద్దవాళ్లు పెట్టుకున్న గజ్జెలపట్టెడవంటి నెక్లేసు ఈ మధ్య ఒకరు పెట్టుకోగా చూశాను. ముత్యాల వాడకం అప్పటినుంచీ వుంటూనే వుంది. కాళిదాసు కుమారసంభవమ్‌లో పార్వతిని వర్ణిస్తూ "ఆమె కంఠానికి గుండ్రని ముత్యాలహారానికీ చక్కగా జోడుకుదిరింది" అంటాడు. కళాపూర్ణోదయంలో మధురలాలస, కళాపూర్ణుడు గ్రీష్మకాలంలో తేలికగావుండే ముత్యాల ఆభరణాలు ధరిస్తారు. కాదంబరిలో మహాశ్వేత ఉసిరికాయలంత మంచిముత్యాల జపమాల మెళ్లో ధరించినది. కాదంబరి, తలపై ముత్యాల చంద్రవంక ధరించింది. వాల్మీకి రామాయణంలో రావణుడు సీతాదేవి నెత్తుకొని పోతుండగా ఆమె మెడలోనుంచి ముత్యాలు పొదిగిన చంద్రహారం జారిపడింది. వాళ్లు పాపటలో ముత్యాల చేరులు ధరించేవారు. రామాయణంలో రామునికి పట్టాభిషేక సందర్భంలో వాయుదేవుడు, నవరత్నాలు, నడుమ నాయకమణితో అలంకరించిన ముత్యాల హారం యిచ్చాడు. ఈ మధ్య కూడా పై విధంగావుండే ముత్యాలనగ ఫేషన్ అయింది. రాళ్లు ముత్యాలు పొదిగిన నెక్లేసులు ఫాషన్‌గా వుంటున్నాయి. మన పెద్దవాళ్లు చెవిబొగడలలో మంచి ముత్యాలు, మెడలో ముత్యాల తావళాలు, అడ్డబాసల్లోకూడా ముత్యాలు వాడేవారు. అమ్మన్న ముత్యాలు దారానికి గుచ్చివేసుకొనేవారు.

దంతపు పూసలుకూడా ఫేషన్‌అయాయి. కాదంబరిలో మహాశ్వేత చేతివ్రేళ్లకు సన్నటి దంతపు ఉంగరాలు పెట్టుకున్నది. ఇప్పుడు చెవులకి, చేతులకి మంచి ముత్యాలు రాళ్లు పొదిగిన ఆభరణాలు ధరించటం ఫాషన్ అయింది. పగడాల తావళాలు మన పెద్దవాళ్లే తప్ప ఇప్పుడెవరూ వాడటంలేదు. రామాయణంలో సీతాదేవి రత్నాలూ పగడాలూ పొదిగిన హస్తాభరణాలు అశోకవనంలో చెట్లకు వేలాడదీసిందట.

ఇక దుస్తుల విషయం. రామాయణ మహాభారతాల్లో పట్టుబట్టలే వర్ణించబడ్డాయి. సీతాదేవి రావణునిచే అపహరించబడినప్పుడు పచ్చ పట్టుచీర ధరించింది. కుమార సంభవమ్‌లో పార్వతి నో కపటబ్రహ్మచారి "కలహంసలు చిన్నెలుగాగల పెండ్లికూతురి పట్టుచీరెకూ..." అంటాడు. మనుచరిత్రలో వరూధిని ఎఱ్ఱని పావడా తెల్లనిసెల్లా ధరించినది. గంధర్వ స్త్రీ ఒకామె తామరరేకులుగల పట్టువస్త్రము ధరించినది. ఆ తామర రేకులు ఏ బంగారు పోగులతో చిత్రించారో! మనోరమ పెండ్లికూతురై తెల్లని తళతళలాడే పట్టుబట్ట ధరించినది. పుంజికస్థల, పలుచని చీరలో ఎఱ్ఱరంగుఅద్దిన పావడా ధరించినది. ఇది బహుశా ఇప్పుడు మనం ధరించేటటువంటి లోపలిపరికిణీ వంటిదేమో నని పిస్తున్నది నాకు. కళాపూర్ణోదయంలో మధురలాలస "పసుపుకొంగుల తెల్లపట్టు దువ్వలువ" ధరించినది. కాదంబరి పల్చని అద్దమువంటి పట్టువలిపెము కట్టుకొంది. అజంతా కుడ్యచిత్రాలలో రంగుబట్టల రకాలన్నీ కనిపిస్తాయి.

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి "తూర్పుచాళుక్యులనాటి సాంఘిక రాజకీయ

# ★ అలంకరణలో పాతకొత్తలు ★

పరిస్థితులు" అనే వ్యాసంలో ఆనాటి విషయాలన్నీ వ్రాస్తూ ఆనాటి స్త్రీలు ఎట్టిని చీరెలు సాధారణముగా ధరించేవారు అని వ్రాశారు (ఆంధ్రపత్రిక విరోధిసంవత్సరాది సంచిక). శ్రీ శేషగిరిరావుగారు తమ వ్యాసంలో "గుప్తరాజుల కాలములో స్త్రీలు చీరెలు, కుట్టుపనికల పరికిణీలు ధరించేవారు. 10,11 శతాబ్దులనాటికి పరికిణీలు తగ్గిపోయి చీరెలు అనేకవిధాలుగా ధరించటం ప్రారంభమైంది" అని వ్రాస్తూ, శిల్పాలలో వున్న కొన్ని విధాలు వర్ణించారు. ఇప్పుడు మనం కుట్టుపనికల పరికిణీలు పలుచని చీరెలలో కడుతూఉంటాము. మనం కట్టుకునే ఫాషన్ చీరెలన్నిటికీ పెద్ద పెద్ద కొంగులుంటున్నాయి. పోతనగారు ఆంధ్ర భాగవతంలో ఋశ్యశృంగునివద్దకు వచ్చిన వారవనితలను వర్ణిస్తూ [illegible]ర్యాంచలోజ్జ్వల ప్రభాదుకూలంబుల్" అని వ్రాశారు. అంటే కొంగునందు బంగారముకల పట్టుచీరెలన్నమాట. ఈపెద్దకొంగులు మన అమ్మమ్మలు వాళ్ళు కట్టుకున్న పట్టుచీరెల కట్టుకొంగులవేపు కూడా వుండేవి. వాళ్ళు సాధారణంగా కాశీపట్టుచీరెలు, కంచి, బెంగుళూరు పట్టుచీరెలు వాడేవారు. చీరెలనిండా జరీపూవు'లవీ వుండేవి. తరువాత ఆ మధ్య సన్నఅంచులు, కొంగులులేకుండా ఫాషన్ అయ్యాయి చీరెలు. ఇప్పుడు వన్ సైడ్ బార్డర్ వుండి పెద్దకొంగులున్న చీరెలు ఫాషన్ అయ్యాయి. పైపట్టుచీరెలేకాక పల్చటి మైసూర్ శిల్కులు, షిఫాన్, నివామ్, నైలాన్, జార్జెట్ వంటి మరీ పల్చటి చీరెలు ఫాషన్ అయ్యాయి. ఈపల్చటిచీరెల మీద పూసలు, వెండి బిళ్ళలు, అద్దాలు కూడా ఫాషన్. భాగవతంలో పోతన శ్రీకృష్ణుడి భార్యలు "ముక్తాఫలాంచల మృదుల దివ్యాంబరాలు" కట్టారనిరాశాడు.

ఈమధ్య 'తెల్లటిడ్రెస్' వేసుకోవటం ఫాషన్ అయింది. వేంకటనాథుని 'హంససందేశం'లో రాముడు ఒక హంసనుచూచి "తస్మిన్ సీతాగతి మనుగతే తద్దుకూలాంకమూర్తౌ (ధవళిమలో తళతళలో దాని తూలికలు సీతాచీరకేమీ తీసిపోవు) అనుకుంటాడు. అటువంటి తెల్లచీరె ఎంత అందంగా వుంటుంది చూడండి.

ఇక రవికెలసంగతి. పూర్వం 'కంచెల' అని ధరించేవారు. పది పదకొండు శతాబ్దాలలో స్త్రీలు 'చున్రీ' చోలీ ధరించేవారనీ, ఆ చోళీ మనచోళీమాదిరి కాక కొంచెం తేడాగా వుందనీ, నేటిమాదిరిగా చేతులుగల రవికలు బిగుతుచోళీలుకూడా ఉండేవనీ ఖజురహో శిల్పాలవల్ల తెలుస్తున్నది.

మన అమ్మమ్మలూ వాళ్ళూ మోచేతుల వరకూ చేతులుండి కంటిమెడ ఉండే చోళీలూ, వదులుగా ఉండే రవికలూ ధరించేవారు. ఈ చోళీ అనేది అసలు మహారాష్ట్రదేశంనుంచి మనకు వచ్చింది.

రవికల చివర్లకి పది పదిహేనేళ్ళ క్రితం పూసల లేసులు, పట్టురవికెలమీద పూసలు కుట్టుకునేవారు. కణుము అంచుల పట్టు రవికలూ ముఖమల్ రవికలు వాడేవారు. ఆ తరువాత ఇక జాకెట్ల రకాలు చెప్పతరంకాదు. మహావగులైనవి, విమానం రెక్కలూ, బుట్టచేతులూ, కుచ్చిళ్ళ కాలర్లూ భుజాలమీదకే చేతులుండేవీ ఇల్లా లెక్కలేనన్ని ఫాషన్స్ వచ్చాయి. వాటికి ఈనాటి చోళీ అందం ఏకోశానా కనపడదు. ఆ తరువాత జాకెట్ చేతులు పొడుగైపోయి మణికట్టువరకూ ఉండడం (పంజాబీస్ డ్రెస్ వంటిది) ఫాషన్ అయింది. ఇప్పుడు మళ్లీ మన పెద్దవాళ్లు ధరించే రవికలే కొద్ది చక్కటి మార్పులలో చోళీలయ్యాయి. ముఖమల్ కూడా బాగా వాడకంలోకి వచ్చింది. పూసల డిజైన్స్ ఫాషన్ అయ్యాయి. ఈ చోళీలవలన గుడ్డ పొదుపుకూడా అవుతున్నది.

ఇక శిరోజాల అలంకరణ విషయం. అజంతా చిత్రాలలో శిరోజాలను రకరకాలుగా ముడుచుకోవటం చూస్తాము. కళాపూర్ణోదయంలో "కన్నె గేదగి ఱేకు లన్నవంగా గొనల్ గాన్పించనిడిన కీల్గంటు" అంటాడు పింగళి సూరన. లేత మొగలి ఱేకుల వంటి కొనలు పైకి కనబడేట్లు జాఱుగా ముడుచుకొన్న వెంట్రుకల దూముడి అన్నమాట. అంత బాగా మనం వేసుకోగలమా జారుముడి. పోతన భాగవతంలో సత్యభామ నరకాసురునితో యుద్ధం చేయటానికి "వేణిన్ చొల్లెము పెట్టి" లేచింది. వేణి అంటే సర్పాకారముగా అల్లిన జడట. అంటే ఒకజడ తాచుపాములా వేసుకొంది కాబోలు సత్య!

ఖజురహో శిల్పాలలో ఆకాలంనాటి స్త్రీలు తలను వెనుకకు దువ్వి ఒకే ముడిగా వివిధ పద్ధతులలో ముడిచేవారనీ ఆ శిల్పాలలోని తలకట్టు పద్ధతులు నేడు తిరిగి పునరుద్ధరింపబడుతున్నాయనీ శ్రీ శేషగిరిరావుగారు వ్రాశారు. గెండుజడలు వేసుకోవటం యీమధ్య ఫాషన్. మన పెద్దవాళ్లు గట్టిగా దువ్వి రకరకాల చుట్టలు లేదా ఒక జడ వేసుకునేవారు.

ఇప్పుడు జడవేసి మెడమీదుగా చుట్ట చుట్టుకోవటం, వదలుగా జడలు, బాబ్డ్ హెయిర్ ఫాషన్‌గా వున్నాయి. మన పెద్దవాళ్లలాగే మనమూ ఫాషన్ అని మధ్య పాపిడి తీసుకుంటున్నాము. ఆ మధ్య ప్రక్క పాపిడులు కొన్నాళ్లు ఫాషన్. తలమీద బంగారు ఆభరణాలుకూడా ఏమీ ఉండటం ఫాషన్ కాదు.

ఇక దేహాలంకరణ. స్నానానికి పూర్వం పూర్వకాలంలో అంగరాగాలూ అవీ అద్దుకునేవారు. స్నానమయాక సాంబ్రాణి ధూపమూ అవీ వేసుకునేవారు. కస్తూరి, పచ్చకర్పూరము, గంధం, కుంకుమపువ్వు, ఒంటికి రాచుకునేవారు. కంటికి కాటుక తప్పకుండా పెట్టుకునేవారు. తిలకధారణ సామాన్యంగా కస్తూరితో చేసేవారు. మనుచరిత్రలోని వరూధిని కస్తూరిబొట్టు ధరించినది. మనోరమకు కుంకుమపువ్వు నరగదీసి సేసబొట్టు పెట్టారు సఖులు. కళాపూర్ణోదయంలో సుగాత్రి కస్తూరిచుక్కతోబాటు పసుపుబొట్టుకూడా పెట్టుకున్నది. కుమారసంభవంలో పార్వతికి తల్లి హరితాలమనే వర్ణద్రవ్యవిశేషము, మనఃశిల అనే ధాతువును కలిపి, కల్యాణతిలకం పెట్టింది. ఖజురహో శిల్పాలలో తిలకధారణలో విచిత్ర పద్ధతులన్నీ కనిపిస్తాయి.

ఇవేకాక పూర్వం చెక్కిళ్లమీద కనుబొమ్మలపైన కుంకుమ కర్పూరం మొదలైన వాటిలో మకరికాపత్రాలు, పత్రలేఖనాలు రాసుకునేవారు. కస్తూరి, కుక్లాగురు, గోరోజనమూకూడా కలిసేవారు. పెదిమెలకు లక్క రంగు రాసుకొని లోధ్రపొడి చల్లటం వలన పసుపు ఎరుపురంగు కలిసిన రంగు వచ్చేదిట. తాంబూలం నిత్యం ఉపయోగించేవారు. ఇందివరాక్షుడు (మనుచరిత్రలో) మనోరమకు అరణమిచ్చిన వస్తువులలో పీటికా పేటికలు (పాందానులు) తమ్మపడిగములు (తాంబూలము ఉమియు పాత్రలుట) వున్నాయి. వ్రేళ్లకి గోరింటాకు, కాళ్లకి పసుపుపారాణి ధరించేవారు. మన పెద్దవాళ్లు ముఖానికి పసుపు రాసుకొని కుంకుమ ధరించేవారు. ఇప్పుడు ఫాషన్ వ్రేళ్లకి క్యూటెక్స్ పెదిమెలకి లిప్‌స్టిక్, బుగ్గలకి రంగు వేసుకోవటమూను. ఇవి తేలిక పద్ధతులవటంచేత ఫాషన్ అయ్యాయి. కుంకుమ బదులు తిలకం ఫాషన్ అయింది. ఇక హేండ్‌బాగ్‌లు, జోళ్లు విషయం. అజంతా చిత్రాలలో చేతిసంచులు, మెట్లగులు ఉన్నాయంటే హేండ్‌బాగ్ ఎంత ప్రాచీనమైనదో తెలుస్తుంది.

మనుచరిత్రలో వరూధిని "రత్నపాదుకలు తొడుగ కవ్వలికి పోయె"నని చెప్పటంవలన స్త్రీలు జోళ్లుధరించటం క్రొత్త ఏమీ కాదని తెలుస్తుంది.

అసలు ఎలాగైనా యిప్పుడు సింపుల్‌గా అలంకరించుకోవటం ఫాషన్. సమయానికి సరిపోయేట్లు అలంకరించుకోవటమే అసలు ఒక ఫాషను. అది ఒక కళ. ★

# అందం; అభిరుచి

అందం రాణించడంలో కీలకం అంతా మన వస్త్రధారణలోనే వున్నదని నా అభిప్రాయము. ఎందుకంటారా! ఎంత బాగులేనివారైనా చీర చక్కగా కట్టుకొని, తల శుభ్రంగా దువ్వుకొంటే ముఖం ఎంతో కాంతివంతంగా వుంటుంది.

"మేం అందంగా వున్నాం. ఎలావున్నా సరిపోతుందిలే" అని అనుకొనేవారు కూడ లేకపోలేదు. చీర కుచ్చెళ్లు సరిగాలేకుండ అంటే ఒకటి పైకి ఒకటి కిందుగ వుండేలా కట్టుకొని, జుట్టు చింపిరి-చింపిరిగా వుంచుకొం[illegible] (వాళ్ళకు చింపిరిజుట్టు, ఫాషన్ గామెను! ఎంత ఫాషన్ అయితేమాత్రము నలుగురికీ నచ్చేలా వుండొద్దూ!) ఇలా ఉంటే ఎంత అందమైనవారైనా కొంత అసహ్యంగా కనబడుతారు.

**మంగళా కందూర్**
**(విశాఖపట్టణం)**

మొన్న న, అంటె ఓ పదిరోజులక్రిందట అనుకొంటా. విశాఖ రైలుస్టేషన్ వెయిటింగ్ రూములో ఓ ఆవిడను చూశా. మెడలో ఒక నెక్లెస్, 2 రాళ్ళ హారము, రెండు పేటల గొలుసులు రెండూ, మూడు పేటల గొలుసులు రెండూ, నాలుగు పేటల గొలుసు ఒకటి, యింకా ఏమేమో (వాటి పేర్లుకూడ నాకు తెలియవు) వేసుకొంది. రెండుచేతుల నిండా గాజులు వేసుకొంది. జడలో బిళ్ళ, నడుంకి వడ్డాణం పెట్టుకొంది. అంతా సరిగా ఉంది. తీరా ఇన్ని సొమ్ములు వేసుకొన్న మనిషీ మళ్ళీ వాయల్ చీర కట్టుకొంది. అబ్బ! చూస్తుంటె ఎంత చిరాకు కలుగుతుందో చెప్పలేనుమరి! అన్ని సొమ్ములున్నవారు ఒక పట్టుచీర కొనలేకపోయారా! అసలు ప్రయాణమప్పుడు అన్ని సొమ్ములు వేసుకొంటే ఏం బాగుంటుంది? నగలుంటె వుంచవచ్చు. అన్నీ ఒకమారె వేసుకోవాలని ఉందేమిటి?

ఇంకో రకంవారు వున్నారు. నగలు పెట్టుకొనేది ఫాషన్ కాదనేవారు. లేనివారు అలాఅంటె సరిపోతుంది. కాని నగలుండీ పెట్టుకోనివారిని నే చూశాను. అంటె అన్నీ ఒక్క మారె పెట్టుకోవాలని కాదు నేననేది. ఎన్ని నగలున్నా ఎప్పుడూ ఒక జత గాజులు, ఒక నెక్లెస్ వేసుకొనే వారిని నేను చూశాను. పోని ఏ Picture కో, ఏషికార్ కో వెళ్ళినప్పుడు అలా చేస్తే బాగుంటుంది. కాని పెళ్ళికి, పేరంటానికి వెళ్ళినప్పుడుకూడ ఈ తరహావారు యిలానే వస్తారు. ఇలాంటి వారిని చూస్తే చిన్నప్పుడు నేను, నగలు



**వాలుజడ వయ్యారి**
చిత్రకారుడు: కె. శేషగిరిరావు,
హైదరాబాదు.

పెట్టుకోవడం ఫాషన్ కాదనుకొని, ఒకమారు పేరంటానికి వెళ్లేటప్పుడు అమ్మ నెక్లెసూ, గాజులూ ఇస్తే వద్దని మొండికేశాను. ఇప్పుడు తల్చుకొంటె నవ్వు వస్తుంది.

నా మట్టుకు నేను "White Lady Hamilton" చీర, తెల్లక్రేపు చోళి వేసుకొని, వెంట్రుకలు రింగుకు చుట్టి, net వేసి, మల్లెపూలు పెట్టుకొని, తెల్లని గాజులు చేతుల వేసుకొని, కాళ్ళకు తెల్లని జోళ్ళు వేసుకొంటే ఎంతో బాగుంటాను. వైట్ షిఫాన్ చీరకు ఆకుపచ్చ, లేదా నీలపు వెల్వెట్ చోళీ వేసుకొని, రాళ్ళ నెక్లెస్ వేసుకొంటే ఎంతో బాగుంటుంది. వెల్వెట్ పైన రాళ్ళ నగలు బాగ కన్పిస్తాయి.

కొందరున్నారు; పట్టు రవికె, వాయిల్ చీర వేసుకొంటారు. చీరలు ఏ ధరవైనా కట్టుకొనే తీరులోవుంది దాని అందం. ఓరోజు నాకు మనసు బాగులేక చాలా చికాకుగా వున్నాను. కట్టుకొన్నదేమో సిల్కు చీర. కాని పైటచెంగు ఒక కొస పొడుగు, ఒక కొస పొట్టి. చాలా అసహ్యంగా వుంది. అంతలోనే మా ప్రక్కింటావిడ వచ్చింది. ఆమెను చూస్తే నాకు సిగ్గేసింది. ఆమె కట్టుకొన్నది నేతచీర. కాని కట్టుకొన్న తీరు చాలా బాగుంది. చీర మట్టసంగా కట్టుకొని బాగా బార్డరు దిద్దివుంది. అంటే రెండు బార్డర్లు బాగా కనబడేలా వుందన్నమాట. చూడడానికి ముచ్చటగా వుంది. అందుకే దుస్తులు ధరించే తీరులోనే మన అందమంతా యిమిడివుందంటాను.

వీపుకు పూసలు, అద్దాలు, ఎంబ్రాయిడీ డిజైనులు కుట్టుకొంటారు. అలాంటి చోళీలు వేసుకొన్నప్పుడు జడ వేసుకోకుండా రింగు (లేదా యిష్టమొచ్చినది) వేసుకొంటే బాగుంటుంది.

కొందరు పైటచెంగును చోళీ కనబడకుండా మూసుకొంటారు. మళ్ళీ ఆ చోళీకి మంచి డిజైన్ వేసుకొని ఉంటారు. ఇలా మూసుకోడానికి కష్టపడి డిజైన్ ఎందుకు కుట్టుకోవాలి? ఎందుకలా మూసుకొంటారని అడిగితే మర్యాద అంటారు. అంటే యింతకూ అలా చెంగు నిండా కప్పుకోనివారు అమర్యాదస్తులన్నమాట వారికి. ఇలాంటి మర్యాదస్తులు కొందరు పల్చటి చీర కొంగు నిండా మూసుకొంటారు.

ఇంకో విషయం. కొందరు నల్లగా ఉంటారు. ముదురురంగు చీరలు కడ్తారు. అది చూడడానికి అంత బాగుండదు. అలాటి ముదురురంగు చీరలు కట్టేటప్పుడు ముందు అవి తనుకి నప్పుతాయా అని ఆలోచించుకోవాలి. మేము అప్పచెల్లెళ్ళు ఇద్దరం, చామనఛాయగావుంటాము. మేము కొంచెము ముదురు రంగు చీరలు కడ్తేనే మా యింట్లో కోప్పడతారు. సహజంగా మేము లేతరంగుచీరలే ఎక్కువగా కొంటాము, కడ్తాము. మనం ఏదైనా చేస్తే అది నలుగురికీ నచ్చుతుందా అనికూడా కొంచెం ఆలోచించుకొని మరీ చేయాలి. మనకు తగినట్టు మనం వస్త్రాలంకరణ చేసుకొంటె మనం అందంగా లేకపోయినా అందంగా వున్నట్టు కన్పిస్తాం.



# వెయ్యి అబద్ధాలు చెప్పి అయినా...

మా స్నేహితురాలు నిర్మలకి ఈమధ్య ఒక సంబంధం వచ్చింది. అబ్బాయి ఒక డిగ్రీ సంపాదించి ఉద్యోగం చేస్తున్నాడు. ఆ అబ్బాయికి నిర్మలని చూపించారు. అబ్బాయికి అమ్మాయి, అమ్మాయికి అబ్బాయి నచ్చారు. జాతకాలు చూశారు. [illegible]యాయి. ఆడపెళ్ళివారు చెప్పిన కట్నానికే వాళ్లు ఒప్పుకున్నారు. సరే, ఇంక ముహూర్తం నిశ్చయం చేసుకుందామనుకుంటున్నారు. ఆ సమయములో పెళ్లికొడుకుగారి దూరపుచుట్టం (వరసకి మేనత్త) అమ్మాయిని చూడాలన్నారు.

ఇష్టం లేకపోయినా సరే లే అనుకుని నిర్మలని మళ్ళీ, పెళ్ళికొడుకుగారికి, అతని మేనత్తగారికీ చూపించారు. మా నిర్మల కన్ను ముక్కు తీరువుగావుండి చూడటానికి బాగానే వుంటుంది. కాని కనుబొమ్మలు కొంచెం కలిశాయి అదిచూసి "మేనత్త" గారు "ఒరే అబ్బాయి, కనుబొమ్మలు ఆడవాళ్ళకి కలియకూడదు. కలిస్తే దోషం" అని నూరిపోసింది. ఆ అబ్బాయి ఆ అమ్మాయిని చేసుకోనని, ఈ కారణం వివరిస్తూ ఉత్తరం రాశాడు. అతని తల్లీతండ్రీ నిర్మల తల్లి తండ్రులకు రాశారు. ఇలాగయితే ఆ అమ్మాయికి పెళ్లయ్యేదెలాగ? అయినా ఆ అబ్బాయికి స్వంతంగా ఆలోచించేశక్తి, బుద్ధి ఉండక్కరలేదు? ఆమె చెప్పిందికదా అని తల ఊపడమేనా! అతనేం పసిపాపా, ఏమీ తెలియకపోవడానికి? ఒక డిగ్రీ సంపాదించి ఉద్యోగం వెలగబెడుతూ దయ్యాలు లేవు, దేవుడు లేడు అని ప్రచారంచేసే ఈ మహానుభావుడికి పాపం, ఈచుట్టం చెప్పిన మాటలవల్ల నమ్మకం కలిగిందిలావుంది.

ఆమె చూడండి తనూ ఆడదేకదా. ఆడపిల్లలకి పెళ్ళికావాలంటే ఈకాలంలో ఎంత బాధ పడుతున్నదీ చూస్తున్నది కదా! పోనీ ఆమెకి పెళ్ళికావాల్సిన ఆడపిల్లలు ఉన్నారేమో అందుకే ఈపెళ్లి పాడు చేసిందేమో అనడానికి ఆమెకసలు పిల్లలే లేరు. ఇలా చేయడంవల్ల ఆమెకి ఏమిటి లాభం. వెయ్యి అబద్ధాలయినా చెప్పి ఒక యిల్లు నిలబెట్టాలని అంటారే అలాగ చెయ్యడంపోయి ఇదేంబుద్ధి. మొదట మన సంఘంలో యిలాంటి నమ్మకాలు ఇలాంటి పెళ్లిళ్లని పాడుచేసే చీడపురుగులూ పోవాలి. అప్పుడు కాని మన పరిస్థితి బాగుపడదు. మనదేశంలో మా నిర్మలలాంటి పెళ్ళి కావలసినపిల్లలు ఎంతోమంది వున్నారు. కనుబొమ్మలు కలిస్తే ఏదో అవుతుందని వెఱ్ఱి నమ్మకాలు పెట్టుకొని కూర్చుంటే ఇంక వాళ్లకి పెళ్ళిఅయ్యేదెట్లా? పిల్లవాడికి ముందరే పిల్ల నచ్చలేదంటే అది వేరే సంగతి.



ఎ. వైదేహి, రాజవోలు

## మరకలు

సాధారణముగా స్త్రీల అజాగ్రత్తవలన, కొన్ని కొన్ని సమయములలో జాగ్రత్తగా వున్నప్పటికి దుస్తులకు మరకలగుచుండును. వీటిని వెంటనే పోగొట్టడానికి ఈ క్రింది పద్ధతులు అనుసరించ వచ్చును.

సిరా మరక :—మరక క్రొత్తదయిన వేడినీరు, సోపు వుపయోగించి రుద్దాలి. పాతదయిన నిమ్మరసము మరకమీద పిండి, ఉప్పు వేయాలి. దానిని కొంతసేపు ఎండలో వుంచి సబ్బునీటిలో ఉతికి ఆరవేయాలి. లేకపోతే పాత మరకను 24 గంటలు పుల్లమజ్జిగలో నానబెట్టాలి.

ఎఱ్ఱసిరా మరక :—చల్లని నీటిలో తడిపి అమోనియాతో రుద్దాలి.

తుప్పు మరక :—సిరామరక తీసినట్లే తీసివేయాలి.

పెయింటు (రంగులు) :—టర్పెన్‌టైన్‌లో ఆ భాగాన్ని నానబెట్టవలెను. మరక పాతదయితే నూనెలోగానీ కిరోసిన్‌లోగానీ ఉతికి ఆరపెట్టాలి.

కాఫీ మరక :—కాఫీ పడినభాగము బేసిన్‌లోపెట్టి వేడినీటిని యెత్తునుండి పొయ్యాలి మరక పాతదయిన "డీరెక్స్"ను మరకమీద వేసి కొంతసేపుంచి వేడినీటిని ఎత్తునుండి పోయాలి.

టీ మరక :—కొత్తమరకను చన్నీరు, సోపు వుపయోగించి వుతికి ఆరవేయాలి. పాతదయిన కాఫీ మరకవలె చేయాలి.

తారు మరక :—ఆలివ్ ఆయిల్‌లో కొంతసేపు నానబెట్టి, సోపు వేడినీటితో ఉతికి ఆరవేయాలి.

పండ్లరసపు మరక :—ఉప్పువేసి రుద్ది, కాఫీ మరకవలె చేయాలి.

జిడ్డు మరక :—నూలు, లెనిన్ వస్త్రముమీద వేడినీరు, సోపుతో రుద్దిన పోతుంది. పాత మరకను బెంజైన్‌ని ఉపయోగించి రుద్దాలి. లేకపోయిన మరక అడుగున అద్దుడు కాగితము పెట్టి ఇస్త్రీ పెట్టితో రుద్దాలి.

సేకరణ : బలిజేపల్లి మహాలక్ష్మి.
(గుంటూరు)

## పాత, కొత్త పద్ధతులు

ఇప్పటి కట్టు, బొట్టు, తీరులు పూర్వపు పద్ధతులేగాని "కలికాలపు చోద్యాలేమీ కావని టి. సీతారామాదేవిగారు జనవరి 23 వ తేదీ సంచికలో వ్రాశారు. మన దేశకాల వాతావరణానికి పల్చనిబట్టలు కావాలని అందుచేత ఇప్పటి స్త్రీలు కట్టుకుంటున్నారనీ, మర్యాదగా మోచేతులు దాటే జాకట్లు వేసుకుంటున్నారనీ ఆవిడ చెప్పారు.

మన దేశంలో పూర్వం అగ్గిపెట్టెలో పెట్టేటంత పల్చటి బట్టలతాను పైదేశాలకు పంపేవారనీ కట్టుకుంటే మహారాణీలు కట్టేవారనీ విన్నాంగాని ఆ విధమైన బట్టలు మనవాళ్లు సంసార స్త్రీలు ధరించేవారని ఎప్పుడూ వినలేదు. అదికాక స్త్రీలు సాధారణంగా పెళ్ళిళ్ళకు, పేరంటములకు తప్ప నలుగురిలో తిరిగే అలవాటు పూర్వంలేదు. ఒకవేళ తిరిగినప్పటికీ వంటినిండుగా బట్ట తీసుకుని తిరిగేవారు. ఇప్పటి నవయువతులు వీధిలో నడుస్తుంటే

చూచే ఆడవాళ్ళకే సిగ్గేస్తోంది.

ఇక ఆభరణాల సంగతి. బంగారం ఖరీదైన తర్వాత నగలమోజు తగ్గినమాట వాస్తవమే. కాని నగల ముస్తాబుమాత్రం ఏ సినీమాలో కనబడే ఫాషన్ల వరవడిలోనో జరుగుతోంది.

ఏది ఏమైనప్పటికి ఇప్పటి దేశకాల పరిస్థితులనుబట్టి స్త్రీలు వీధిలోకి రాక తప్పదు. ఎందుచేతనంటే సాధారణంగా ఉద్యోగాల చేత, మగవారికి తీరికలేక స్త్రీలే బజారు పనులు వగైరా చూచుకోవడం జరుగుతోంది. అందుచేత కొంచెం మర్యాదగా కనుపించే పద్ధతిలో వస్త్రాలు ధరిస్తే పెద్దలు సంతోషిస్తారు. సంఘంలోకూడా కొంత మర్యాద వస్తుంది. చాలమంది కాలేజి పిల్లలను సినీమా తారలపేర్లుపెట్టి పిలవడం ఈనాడు పరిపాటైనది.

పాకల సీత (ఏలూరు.)

* * *

## అ[illegible]కే...

వచ్చే ఏప్రిల్ నుంచి మనకు రూపాయకు నూరు నయాపైసలు వస్తాయి. చిల్లర ఎక్కువ అవుతుంది. కనుక నూరు నయాపైసలు జేబులో ఉంటే 5,10 చొప్పున చాలా ఖర్చు పెట్టేస్తాం. డబ్బులకన్నా ధారాళంగాఖర్చు చేసే నిముషాలు. 5 నిమిషాలు పదినిముషాలు చొప్పున వ్యర్థంచేస్తూ గంటలకొద్దీ గడిపేస్తుంటాం. మనదగ్గిర చాలా చిల్లరుందిగా రోజుకు 1440 నిముషాలు మరి.

ఏదైనా పొరపాటున పోయినా తిరిగి దొరకవచ్చు. కాని కాలం చేయిజారితే తిరిగి పట్టుకోలేం. అయ్యోచ్చేదాకా అమావాస్య ఆగదని తెలుగుసామెత. టైం అండ్ టైడ్ వెయిట్ ఫర్ నోమాన్ అని ఇంగ్లీషు సామెత. కనుక మనం తగినపని సరియైన సమయంలోనే చేయాలి. తరువాత చేద్దామంటే వీలుపడదు డబ్బు ఉంటే బ్యాంకులో వేసుకొని రేపు ఉపయోగించుకోవచ్చు కాని కాలాన్ని దాచే బ్యాంకు లోకంలో లేదు. రేపటిరోజును ఇవాళ ఉపయోగించుకోలేం సరిగదా, రాబోయే క్షణాన్ని ఇప్పుడు వినియోగించుకోలేం. కాలానుగతంగా మనమూ నడవాలి.

కాలానికి పక్షపాతంలేదు, రోజుకు నీకూ 24 గంటలే, నాకూ 24 గంటలే; చివరకు ప్రధాని నెహ్రూగారికు, ప్రెసిడెంట్ ఐసెన్‌హోవరుకూ 24 గంటలే. ఎవరైనా సరే ఈ 24 గంటలనే, ఉపయోగించుకోవాలి. అలా శ్రద్ధగా ప్రతిక్షణాన్ని ఉపయోగించుకొన్నవారే అభివృద్ధిలోకి వచ్చారు. వారే ప్రపంచ నాయకులయ్యారు. కనుక ప్రతిఒక్కరూ కాలాన్ని సరియైన విధంగా ఉపయోగించుకోవాలి. అందుకే నేనీ ఉత్తరం చిన్నదిగా వ్రాశాను.

లలిత (కాకినాడ)

* * *

## పోతపాలు

ఆమధ్య మాకు తెలిసినవారమ్మాయి మా యింటికి వచ్చింది-ఏమండీ! మీఅబ్బాయికి ఏపాలు పోస్తారో మా అమ్మ అడగమన్నదంటూ! రాగానే యిదేంప్రశ్నా! అనుకుంటూనే 'గ్లాక్సో' అన్నా. అయితే ఒకమాటు కలపటానికి సరిపడేపొడి మాఅమ్మ అడిగి పట్టుకురమ్మందండీ అన్నది ఆపిల్ల.

నాకేమో ఊరుకోబుద్ధవలేదు. మీ తమ్ముడికి పోతపాలా? అన్నా.

మాతమ్ముడికి పాలు చాలటంలేదు. అందుకని పోతపాలు పొయ్యాలని మొదలు పెట్టారు. కాని వాడు వేరే ఏపాలూ తాగటంలేదు. ఆవుపాలూ తాగడు. డబ్బాపాలూ తాగడు. అయినా మీ రేపాలు పడుతున్నారో కనుక్కొని అమ్మ రమ్మంది అని ఆ అమ్మాయి అన్నది.

మరి వేరే ఏపాలూ తాగక, తల్లిపాలూ చాలక, ఎట్లాఉండగలుగుతున్నాడు? అన్నా.

అల్లాగే యిగిరిపోతాడుగాని మరేపాలూ తాగటంలేదు. మరి నేవెళ్తానండీ అంటూ నేనిచ్చిన పౌడరు తీసుకెళ్లింది అఅమ్మాయి.

ఒక పదిరోజులక్రితం ఆ అబ్బాయిని చూడటం తటస్థించింది. చాలానీరసంగా ఉన్నాడు. నడస్తాడాఅని అడిగాను ఏడాది వెళ్లిందంటే. ఇప్పుడిప్పుడే తప్పటడుగులు వేస్తున్నాడట.

సాధారణంగా బిడ్డకి పాలు సరిపోయిందీ లేనిదీ తల్లికి తెలుస్తుందిగదా! పైముప్రకారము పాలుయిచ్చినా, కొల్లగా సీసాతో పట్టినా (Bottle feeders) బిడ్డకు కడుపు నిండందే తల్లినివదలరు.అయినా వాళ్లకి పాలు సరిపోకపోతే ఏడుస్తారు. దాన్నిబట్టి వాళ్లి పాలకొలతలు క్రమంగా హెచ్చించాలనీ, ఈనాటి కొలతపాలు నెలతరవాత చాలవనీ అర్థంఅవుతుంది.

పిల్లవాడికి తల్లిపాలు సరిపోవని తోచగానే, ఒకటి రెండుసార్లు, వాళ్లు కడుపు నిండక ఏడుస్తున్నారో, మరేకారణంచేతనో ముందు చూసుకుని, మనం పోద్దామనుకున్న పాలుపోయడం మొదలుపెట్టాలి. లేతనెలలు అయితేతప్ప, కాస్తర్, 6 నెలలువస్తే బిడ్డలకు nipples యొక్క తేడా తెలిసి, సీసా ఫీడర్ని తోసేస్తారు. తాగరు. కాని ఏడ్చినా, క్రమంగా వాళ్లిని ఫీడర్‌తో తాగటానికి అలవాటుచెయ్యాలి. తర్వాత నెమ్మదిమీద ఏడాది దాటేంతర్వాత బల్లీ గ్లాసులతో అలవాటు చెయ్యవచ్చు ననుకోండి."

అన్నింటిలోకీ ఆవుపాలు శ్రేష్ఠంఅన్నది అందరికీ తెలిసిందే. శ్రీమతి భైరవభొట్ల లీలా సీతారాంగారి (ఆంధ్ర వారపత్రిక 9-1-57) వ్యాసం చూశాక యింకా స్పష్టంగా తెలిసి వుంటుంది.

అట్లాకాక, మరేయితర డబ్బాపాలు వాడదల్చుకున్నా, ఆడబ్బాలమీదే పాలు కలిపేపద్ధతి వివరాలుగా వ్రాసివుంటాయి. మరొకవిషయం. బిడ్డకి పోతపాలు మొదలు పెట్టిందగ్గరనుంచి, మాన్పించేవరకూ ఒకే రకం వాడాలి. కాని రెండుమూడురకాలు మార్చకూడదు.

ఆర్నెల్లతరవాతనైనా తనపాలు సరిపోవు అని తల్లి మొదటనే గ్రహించి, బిడ్డకి లేత నెలల్లోనే పోతపాలు అలవాటుచేయటం శ్రేయస్కరం. అలా జాగ్రత్తపడకపోతే పిల్లలు మంకుతనంపట్టి, ఏ ఇతర పాలూ తాగక, తల్లిపాలు సరిపోక, నీరసించడం వాళ్లినిచూసి మనం బాధపడడంమటుకు తప్పదు. అయినా పిల్లలు వాళ్లి ఈడుకితగ్గ ఆహారం తీసుకుని చురుకుగా, ఆరోగ్యంగా వుండకపోతే యేతల్లిదండ్రులు బాధపడరు చెప్పండి!

వి. మధులత. (గుంటూరు)

## గోగుపువ్వుతో జామ్

కావలసిన సామానులు:-గోగుపువ్వు, చక్కెర.

గోగుకాయపూవులను తీసుకొని పువ్వు రెక్కలు వేరి వేరుగా ఉంచుకోవాలి.

ఒక వెడల్పాటి కళాయిపాత్రలో గాని, స్టెయిన్‌లెస్ స్టీలు పాత్రలోగాని కొద్దిగా నీరు పోసి సన్నని మంటమీద ఆ పువ్వు రెక్కలను బాగుగా ఉడకబెట్టాలి. ఆ ఉడికించిన పువ్వు, ఆరినతరువాత మెత్తగా రుబ్బాలి. ఆ రుబ్బగా వచ్చిన రసమును, ఒకపాత్రలో కొలిచి పెట్టుకోవాలి.

ఒకకప్పు రసమునకు రెండు కప్పుల చక్కెర, (మనము కొలుచుకున్న రసమునకు రెట్టింపు అన్నమాట) పోసి సన్నని మంట పైన బాగుగా చిక్కగ అయ్యేంతవరకు ఉడకబెట్టాలి. అలాఉడికించిన తరువాత పొయ్యిమీదనుండి దించకముందు, అజామునకు తగినంత లవంగపట్ట వేసుకుంటె బాపుంటుంది.అది బాగుగా ఆరినతరువాత బుడ్డియందు పోసుకొని పెట్టుకుంటె ఒక సంవత్సరము దాకయిన నిలువచేయవచ్చును. ఈజాము బజారులోనైతే పైనగాని, లేకయింట్లో చేసిన రొట్టెపైన గాని వేసుకుంటే చాల బావుంటుంది.

పులుకూరి జాయికల్యాణి(నెల్లూరు.)




సూర్యదేవర ప[illegible]జ్యోతి

అబద్ధం చెప్పొద్దని మరి
ఆవేశంగా అంటావే
అమ్మా నువ్వు చెప్పేవన్నీ
అబద్ధాలు కాదంటావా?

తలకు నూనె రాస్తానే
తల దువ్వటకంటావే
తర్వాతేమో మరి
తల అంటి పోస్తావే—

ఆదివారం రేపేనంటూ
ఆడుకో వచ్చంటావుగా
తెల్లవారగానే మరి
తెచ్చుకో పుస్తకాలంటావ్ !

పప్పులు కొనిపెడతానంటూ
మెప్పుగా చెపుతూంటావుగా
ఎప్పుడైనా కొన్నావా మరి
చెప్పవే అమ్మా మరి అది.

మామవచ్చి మన అందరినీ
మామ్మగారి వూరికీ
తీసుకెడతా డంటావు ఏడీ
వూసుపోని మాటలా అవి?—

మబ్బులోని చందమామ
మనమామ య్యంటావుగా
మామ్మఊరి కెట్లామరి
మనమెడతామే అమ్మా!

అబద్ధం చెప్పొద్దని మరి
ఆవేశంగా అంటావే
అమ్మా నువ్వు చెప్పేవన్నీ
అబద్ధాలా కాదంటావా?



# పిల్లి ప్రభువు

పూర్వం ఒకడి దగ్గర పిల్లి ఒక టుండేది. అది క్రమంగా ముసలిదయి ఎలుకలను పట్టలేక పోతోంది. అప్పుడు అత నిట్లా అనుకున్నాడు: 'యీ పిల్లి వల్ల నాకు లాభం యేమిటి? దీన్ని తీసుకువెళ్ళి యే అడవిలోనో వొదిలి రావడమే ఉత్తమం!'

అనుకున్నట్లుగానే చేశేశాడు కూడా. పిల్లి అత్తిచెట్టుకింద కూలబడి కుమిలి కుమిలి యేడిచింది. ఇంతలో ఒక నక్క ఆ దారినే వచ్చింది.

'ఎవరు నువ్వు?' అనడిగింది.

పిల్లి తనను తాను సంబాళించుకొని బదులు చెప్పింది: 'నేను— పిల్లి ప్రభువును!'

ఇంత గొప్పవాడితో స్నేహం చేయటం ఘనమేనని భావించుకుంది నక్క.

'అట్లా అయితే నన్ను పెళ్ళి చేసుకోరాదా పిల్లిప్రభూ! నీకు మంచి భార్యగా మెలుగుతాను. నీ యిల్లు ఎంతో బాగా చక్కదిద్దుతాను.'

'పరమ సంతోషం! అట్లాగే!' అంది పిల్లి.

ఈ ప్రకారం పిల్లి, నక్క వివాహం చేసుకుని కాపురంపెట్టాయి.

పాపం, నక్క భర్తను సుఖపెట్టడానికి ఎంతో శ్రమపడేది. కోడిపెట్టలను పట్టుకువచ్చి ఆహారంగా సమర్పించేది. తాను పస్తయినా వుండేది కాని, మగడికి మస్తుగా ఆహారం పెట్టేది. అత నేం అడిగినా లేదనకుండా తెచ్చేది.

ఒకనాడు, కుందేలు నక్కను కలుసుకుని మాట్లాడింది:

'నే నివాళ నీ యింటికి వస్తాను. మళ్లీ నీ ప్రేమను సంపాదిస్తాను—'

'లాభం లేదు, కుందేలూ. పిల్లి ప్రభువుగారు యిప్పుడు నాతోనే నా యింట్లోనే వుంటున్నారు. ఆయన


శ్రీ విరించి


నిన్ను చూస్తే చీలికలు చేసి పారేస్తాడు!'

ఇంతలో పిల్లి గుడిసె బయటకు వచ్చి, వళ్ళు విరుచుకుని 'మ్యావ్-మ్యావ్' అంది. ఈ అరుపు వినేసరికి కుందేలుకు ఎక్కడలేని భయం ఆవేశించింది. నక్కతో ముక్కమాత్రమయినా చెప్పకుండా అడవిలోకి ఒకటే దౌడుతీసింది. అక్కడ తోడేలు, ఎలుగుబంటి, అడవిపంది కనిపించగా తాను 'పిల్లిప్రభువు' అనే బ్రహ్మాండమైన జంతువును చూచినట్లు విన్నవించింది.

వాళ్ళు నలుగురూ సమాలోచించుకొని యీ పిల్లి ప్రభువుతో స్నేహపాత్రంగా సంచరిద్దామని తీర్మానించుకున్నారు. నక్కనూ పిల్లినీ ఒకనాడు విందుకు పిలుద్దామనుకున్నారు. విందుకు సమకూర్చవలసిన ఆహారపదార్థాలను గురించి చర్చించుకున్నారు. తోడేలు అంది: మన అతిథికి నేను మాంసం తెస్తాను.

'దుంపముక్కలు తెస్తాను నేను' అంది పంది.

'తేనె తీసుకువస్తాను-' అంది ఎలుగుబంటి.

కుందేలు అప్పుడే కాబేజి తెస్తానంటూ పరుగుతీసింది.

పదార్థాలన్నీ సమకూర్చి వంట పూర్తిచేశారు. అయితే ఎవరు వెళ్లి ఆ పుణ్యదంపతులను పిలుచుకు రావాలి?-అన్న ప్రశ్నకు జవాబు కోసం సతమతమయ్యారు.

ఎలుగుబంటి 'నాది స్థూలకాయం. ఏమాత్రం ఆయాసం కలిగినా ఊపిరి నిలిచిపోతుంది' అంది.

'నా ఆకారం చూస్తేనే డోకు వస్తుంది. అయినా యీ పనికి నేను పనికిరాను' అంది పంది.

'నేనా ముసలిదాన్ని. చెవులు తిన్నగా వినపడవు' అంది తోడేలు.

ఏతావతా, కుందేలు యీ కార్యభారం బుజాన వేసుకు బయలుదేరింది. పరుగెత్తుకుంటూ వెళ్ళి గుడిసెతలుపు మూడుసార్లు తట్టింది. నక్క బయటకు వచ్చింది. 'యేం కావాలి?'

'తోడేలు, ఎలుగు, పంది, నేనూ కలిసి నిన్నూ మీ పిల్లిప్రభువును విందుకు పిలవాలనుకున్నాం. యీ రోజున-తప్పకుండా రావాలి సుమా!' అని గుక్క తిప్పుకోకుండా చెప్పేసి, కుందేలు తన స్నేహితుల దగ్గరకు దౌడుతీసింది. ఎలుగుబంటి వున్నట్లుండి వాళ్లను తమ చెంచాలు తీసుకురావడం మర్చిపోవద్దని చెప్పావనుకుంటాను' అంది.

**వానరసేన**

చిత్రకారుడు: సి. చిన్నారావు—మద్రాసు.



# పిల్లి ప్రభువు



కుందేలు గాభరాపడి మళ్లీ పరుగుతీసింది. తలుపు తట్టి చెప్పింది: 'వచ్చేటప్పుడు మీ చెంచాలు మర్చి పోకుండా తెచ్చుకోండి.'

'మర్చిపోములే' అంది నక్క.

నక్క తనకున్న వాటిలో మంచి ఉడుపులు ధరించింది. పిల్లి చేయి పట్టుకుని ప్రయాణం మొదలెట్టింది. పిల్లి ప్రభువు మ్యావ్, మ్యావ్ మంటూ ముందుకు నడుస్తున్నాడు. కళ్లు పచ్చదీపాలలా మెరుస్తున్నాయి.

భయపడింది. పరుగున వెళ్లి ఒక పొద మాటున దాగుంది. పంది బల్లకింద చేరింది. ఎలుగుబంటి గబగబా ఒక చెట్టు ఎక్కి దట్టమైన కొమ్మల మాటున దాక్కుంది. కుందేలు ఒక బొరియలోకి దూరి కళ్ళప్పగించి చూస్తోంది.

బల్లమీది మాంసాహారం చూడగానే పిల్లిప్రభువు పరవశమయిపోయి గబాలున అక్కడకు చేరుకున్నాడు. మ్యావ్ మ్యావ్ మంటూ అక్కడున్నదంతా ఆరగించసాగాడు.

ఈ ఆకారం చూచి తోడేలుఈ అలికిడికి నాలుగు జంతువులూ బెగడొందాయి.

'ఏం ఆత్రం! ఏదీ ఎక్కువ కానట్టుందే!' అనుకున్నాయి.

పిల్లిప్రభువు కడుపారా భుజించారు, పానీయాలు సేవించారు. బల్లమీదే మెలికలుతిరిగి పడుక్కొని నిద్రపోయారు.

బల్లకింద దాగున్న అడవిపంది మెల్లిగా తోక సారించింది.

పిల్లిప్రభువు అదిచూచి బహుశా ఎలుక పిల్ల అయి వుంటుందని దాని మీదకు దూకింది. తీరా అడివి పందిని చూచేసరికి గుండెలు అలిసిపోయి, ఎలుగుబంటి ఎక్కిన చెట్టు మీదికే గబగబా లంఘించింది.

(48-వ పేజీ చూడండి)

# జీవహింస చేస్తే

ఒక ఊళ్లో రహీము నే కసాయి వాడుండేవాడు. అతను గొర్రెలను చంపి వాటి మాంసమును దుకాణములో పెట్టి అమ్ముతుండేవాడు. సాయిబులంతా అతనిదగ్గరే మాంసమును కొంటూ ఉండేవారు. ఆ ఊరి పెద్దలలో ఒకడు రహీమును దగ్గరకి పిలచి "నీవు చేసేపని చాల క్రూరమైంది గదా! దానివల్ల చాల పాపం వ ందన్న సంగతి, దాని ఫలం ఈ జన్మలోగాని వచ్చే జన్మలోగాని అనుభవించాలని నీకు తెలీదా? అందుదువల్ల అటువంటి వృత్తి మానేసి వేరే వృత్తి ఏదైనా చూసుకోరాదా?" అన్నాడు. కాని రహీము అతని సలహాను వినలేదు.

ఒకరోజు ఉదయాన్నే ఒక వింతమనిషి రహీమ్ దుకాణానికి వచ్చాడు. అతనికి తలంతా నెరసి, గడ్డం తలవెంట్రుకలు కలిసిపోయి ఉన్నాయి. కాని ముఖంలో విచిత్ర తేజస్సు కనిపిస్తోంది. అతన్ని చూడగానే రహీమ్ లేచి "ఏమి కావాలండి మీకు" అని అడిగాడు. అతను "నాకు ఆరుపౌన్ల మాంసం కావాలి" అన్నాడు. రహీమ్ మాంసం తూచి యివ్వగానే అతను ఆ మాంసం ధర కనుక్కొని క్రొత్త రూపాయి నాణేలు 5 అతని చేతిలో పెట్టాడు. అవన్నీ అప్పుడే తయారుచేసిన వాటిలాగా ఉన్నాయి. వాటిని చూసి మోజుపడి వేరే డబ్బాలో వేసి దానిని గల్లాలో ఒకచోట ఉంచాడు. రోజూ అదే వేళకి అతను రావటము మాంసం తీసికొని క్రొత్త నాణాలు యిచ్చి వెళ్ళటం జరుగుతోంది. రహీమ్ అతను ఇచ్చిన దాన్ని యెప్పటికప్పుడు ఆ డబ్బాలోనే వేస్తూ ఉండేవాడు. ఇలాగ వరుసగా ఆ సాహెబుగారు ఐదు నెలలు వచ్చారు.

*************************

## భాగీరదీబాయి

*************************

ఒకరోజు అతను గొర్రెలని కొనటానికి బజారుకు బయలుదేరదామనుకున్నాడు. అప్పుడు అతను గల్లాలో డబ్బేగాక ఆ డబ్బాలోది తీయాల్సి వచ్చి అతను డబ్బాలో చెయ్యి పెట్టి డబ్బుకోసరం తడిమాడు. అతని చేతికి ఎండుటాకులు గుండ్రంగా కత్తిరించినవి వచ్చినవి. దాంతోటి రహీమ్‌కు గుండె ఆగినంతపనైంది. "ఎంత మోసం చేశాడు ఈ సారి రాని చెబుతాను" అనుకొన్నాడు. కాని ఆ వింతవ్యక్తి తన్ను సన్మార్గంలో పెట్టడానికి వచ్చిన ఇంద్రజాలికుడని అతనికి తెలీదు పాపం. అతను చూసుకొన్నది ఆ వింతవ్యక్తి ఉదయాన్నే వచ్చి మాంసము. కొనుక్కొని వెళ్ళిన తరువాత.

ఆ మరునాడు ఉదయాన్నే మామూలుగా ఆ వింతవ్యక్తి మాంసానికని అతని కొట్టుకు వచ్చాడు. అతను కొట్టుదగ్గరకు రాగానే "ఎంత మోసంచేశావు! ఇప్పుడే నీకు అందరి ముందర తగిన శాస్తిచేస్తాను" అని అందరిని (దారిన పోయేవారిని) కేకలువేశాడు. ఏమి జరిగిందో అని అంతా అతని దుకాణం దగ్గరకు వచ్చారు. ఆ వచ్చినవారితో జరిగిందంతా చెప్పి "మీరే చెప్పండి. అతడు మోసం చేసాడో లేదో చెప్పినట్లైతే మీ ముందరే అతనికి తగిన శాస్తి చేస్తాను" అన్నాడు.

అతను ఆ మాట అనగానే "నే చెప్పేదికూడ కొంచెం విని ఆ తరువాత మీరు యేమనున్నా చేయండి" అన్నాడు. ఆ వింతవ్యక్తి. వారంతా దానికి ఒప్పుకున్నారు. అతడు అందరిని ఉద్దేశించి "మీలో ఎవరైనా ఒక్కసారైనా ఇక్కడ మాంసం కొననివారున్నారా?" అని అడిగాడు. "లేరు! లేరు!" అని సమాధానం ఇచ్చారు.

"నేను అతనికి చేసిన మోసం కన్నా యెక్కువగా అతను మిమ్మల్ని మోసపుచ్చాడు. మీరు ఇక్కడ కొనుక్కొని వెళ్లింది గొర్రెమాంసం అనుకుంటున్నారు. కాని అది మనిషి మాంసం. కావాలంటే ఇప్పుడు అతని దుకాణం వెనుక తల లేని ఒక మనిషిశవం చెట్టుకు వ్రేలాడగట్టి ఉంటుంది. కావలిస్తే పోయి చూడండి" అన్నాడు. అది విని రహీమ్ తనలో "నే నిందాక చంపిందిగొర్రెనేకదా! నాకేంభయం" అని వారి నేమీ అడ్డుపెట్టలేదు.

అంతా ఆ వింత ఇంద్రజాలికునితోసహా దుకాణం వెనుకకు

పోయి చూచారు. యేముంది. అక్కడ మన వింతవ్యక్తి ఇంద్రజాలంచేత గొఱ్ఱెశవం కాస్తా మనిషి శవంగా అందరికి కనిపించింది. దాంతోటి జనం అంతా "ఎంత మోసం చేశావు. మమ్మల్ని మనిషి మాంసం తినేట్లు చేశావా" అని తలా ఒక తన్ను తన్నటం మొదలు పెట్టారు. ఆ తన్నేవారిలో మన వింత ఇంద్రజాలికుడుకూడ ఉన్నాడు. చివరికి అతని కంటికి దెబ్బకూడ తగిలింది. అప్పుడు రహీమ్ తనలో "ఆ పెద్దమనిషి చెప్పినట్లు విని ఈ వెధవవృత్తి మానేసి ఉండినట్లైతే ఈ అవమానం జరిగేది కాదుకదా!" అని అనుకున్నాడు.

కాని వారు అంతటితో రహీమ్‌ను వదలిపెట్టలేదు. వారు అతనిని బంధించి ప్రక్కనున్న పట్నానికి తీసికొనివెళ్లి న్యాయస్థానంలో న్యాయాధికారివద్ద నిలబెట్టి "తమచేత మనిషిమాంసం తినిపించాడని" చెప్పారు. అది విని న్యాయాధికారి ఉగ్రుడై విచారణ చేయకుండా నూరు కొరడా దెబ్బలు వీపుమీద కొట్టేటట్లు శిక్ష విధించాడు. శిక్ష పూర్తికాగానే అతనిని వదలిపెట్టారు. అది అయ్యేటప్పటికి సాయంత్రం ఐంది. అతనికి వంట్లో బాధ, అవమానంవల్ల మనస్సుకి బాధ, ఆకలి అపరిమితంగా ఉన్నాయి. అతనికి ఆ పెద్దమనిషి చెప్పినట్లు ఎందుకు వినలేదా అని మనస్సులో బాధగాఉంది. అతని జేబులో దమ్మిడీ లేదు. ఉన్నదంతా దోచుకున్నారు. స్పృహతప్పేటట్లుంది.

ప్రక్కనే ఉన్న ఒక ఇంటిముందు కుంపు ఉంటే నీళ్ళు త్రాగుదామని ఆ ఇంటిదగ్గరకు వెళ్ళాడు. నీళ్లు త్రాగగానే అతనికి నిద్ర అపరిమితంగా వచ్చింది. అతని బొజ్జలో మాంసంకోసే కత్తి పెట్టుకున్నాడు. ఆ ఇంటిబయట అరుగు ఉంటే అక్కడకు వెళ్ళి తలవాల్చాడు. వెంటనే నిద్రాదేవి అతనిని పూర్తిగా ఆవహించింది. అలా ఎంతసేపు గడచిందో చెప్పలేము.

ఇంతలో అతనికి శరీరం బాగా బాధగా ఉన్నట్లుండి మెలకువ వచ్చింది. లేచి చూడగానే పోలీసులు అతనిని కొరడాలతో కొట్టుతున్నారు. అది అతని బాధకు కారణం. అతను లేవగానే పోలీసు అధికారి ఒకడు అతని శరీరం సోదా చేశాడు. చేయగానే అతనికి మాంసం కోసే కత్తి కనిపించింది. ఇదంతా ఎందుకు జరిగిందంటే అతను పడుకున్న ఇంట్లో దోడిపి, ఒక హత్య జరిగినయి. హంతకుడికోసరం వెదుకుతూ ఇతనిదగ్గరకు వచ్చి ఇతనినే హంతకుడుగా నిర్ణయించి పాపము రహీమ్ యేదో చెబుతున్నా వినిపించుకోక న్యాయస్థానానికి తీసికొని వచ్చారు.

ఇంతకు పూర్వము ఇతనిని విచారించి శిక్షించిన జడ్జీయే ఇప్పుడు కూడ విచారించటమె మొదలు పెట్టాడు. జడ్జీ ఇతనిని చూచి జాలిపడి శిక్షను 100 కొఅడా దెబ్బలు, 2 రోజులు జైలుగా తగ్గించాడు.

శిక్ష పూర్తి అయింది. తరువాత అతనిలో పూర్తిగా మార్పు వచ్చింది. అతనికంటికెదురుగా తాను అనేక జీవాలు చంపినందున వచ్చేపాపం నాట్యమాడుతూ కనిపించింది. ఆ జీవాల ఉసురే ఈ అవమానాలకు మూలం అని తెలిసికొన్నాడు. ఆ పెద్దమనిషి చెప్పిన మొదటే వినకపోతినే అని విచారపడ్డాడు.

అతనికి తన జీవితంమీద విరక్తి కలుగజొచ్చింది. కొందరి సలహావల్ల అతను హిందూమతంలోకి వచ్చి తను చేసిన పాపాలు వదిలించుకొని మోక్షంకోసరం ప్రయత్నానికి హిమాలయానికి వెళ్ళిపోయాడు. అప్పటికి ఇప్పటికి అతను మరి కన్పించలేదు. ★

## పిల్లి ప్రభువు

[46 వ పేజి తరువాయి]

పిల్లి ప్రభువు తనతో యుద్ధానికి వస్తున్నాడనుకొని ఎలుగుబంటి యింకా పైకి ఎక్కింది. కాని చెట్టుకొమ్మలు బలహీనంగా వుండి విరిగాయి. ఎలుగు కిందికి పడింది. తోడేలు పొంచివున్న పొద వెనుకగా పడింది.

తన ప్రాణానికే మోసం వచ్చిందన్న ఖంగారుతో తోడేలు పిక్క బలంచూపి పరుగెత్త సాగింది. తోడేలు, ఎలుగుబంటి ఎంతవేగంగా పరుగెత్తినాయంటే, వేగంలో పేరు పొందిన కుందేలు పిల్లకూడా వాటిని అందుకోలేకపోయింది.

పిల్లి ప్రభువు తిరిగి బల్లఎక్కాడు. ఇంకా మిగిలివున్న దుంపలూ, తేనే సేవించాడు. దంపతులు ఉల్లాసంగా యింటికి వెళ్ళారు.

ఎలుగు, పంది, తోడేలు, కుందేలు—చాలసేపటికి ఒకచోట చేరుకుని — 'పిల్లిప్రభువు ఎంత దారుణమైన జంతువు! చూపులకు చిన్నే అయినా నలుగురి ఆహారం కడుపులో ఒక మూలకయినా చాలినట్లు లేదు—' అనుకున్నాయి. ★

# సినిమా

## నిన్న విన్న కథలే అయినా...

తెలుగుదేశంలో బస్సులుపడ్డ కొత్తల్లో బళ్ళవాళ్ళంతా వాటిని తిట్టుకుంటూ ఓపాట పాడేవారు.

అలాగే చలనచిత్రాలు వచ్చిన తొలి రోజుల్లో నాటకకళాభిమానులు వాటిని కొంతచూచి కలత చెందారు.

దరిమిలా టాకీలువచ్చి, మూకీల మీద ప్రజలకు మోజు విరుగుతున్న రోజుల్లో, మౌన చిత్రకళను కళగాఎంచి, మన్నించిన వారంతా కలవరపడ్డారు. ఆతరహావారు ఈనాటికీ టాకీలు నిర్మించినా, భాషకన్న భావానికే, శబ్దంకన్న నిశ్శబ్దానికే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చి కళాఖండాలు నిర్మిస్తున్నారు; మెప్పులందుకుంటున్నారు.

కొన్నాళ్ళకు వెండితెర రంగుల హంగులమర్చుకోవడం మొదలుపెట్టింది. తెలుపు నలుపులలో జీవితపు వెలుగునీడలు చూడగలిగినవారికి కొంత బెంగకలిగింది.

అంతలోకి 'పులిమీద పుట్రలా' ఈ కళ మీద టెలివిజన్ దాడిచేసింది. అక్కడితో తెరవెడల్పు అయింది. (త్రీ-డీ, సినేరమా, సినిమాస్కోప్, విస్టావిజన్, మొదలగునవి వచ్చాయి. 'హై—ఫీ' (హై ఫైడెల్టీ) శబ్దం వచ్చింది.

ఇవన్నీ రాదగ్గవే. రావలసినవే. మార్పు, అభివృద్ధి అనుదినం క్షణక్షణం జరగడం వెయ్యేళ్లకీ కావలసినదే.

అయితే, ఒక్క విషయం గమనార్హం. ఈ అభివృద్ధి అంతా సాంకేతికరంగంలోనే.

దానాదీనా మొత్తానికి ఏంజరిగింది?

సినిమాతీయడానికి ఖర్చు పెరిగింది.

జరిగిందంతా సాంకేతిక శాఖకి; పెరిగిందంతా ఖర్చుకి.

చలనచిత్రకళమటుకు మామూలుగా, తనదారిన తను ముందుకు నడుస్తోంది. మహత్తర చిత్రాలు అనేవి నేటికీ వెండితెర మీదనే కనబడుతున్నాయి తప్ప రంగు తెర మీద కాదు.

కాగా వినోదం ప్రధానాంశంగా తయారయ్యే చిత్రాలు ఎటు నడుస్తున్నాయో చెప్పటం కష్టంగా ఉంది. ప్రపంచ చలనచిత్ర రాజధాని హాలీవుడ్‌లో, చిత్రనిర్మాణ వ్యయం పేరు చెప్పి, నిర్మాతల దృష్టి పాత కథలమీదికి పురాణాలమీదికి మళ్ళింది. బలంగల కథకు, రంగులూ సెట్టింగులూ మొదలైన హంగులు పుష్కలంగా సమకూర్చితే, డబ్బుకి ఢోకా ఉండదన్న సూత్రం శిరోధార్యం అయింది. బలంగల కథ అంటే, బలం బుజాపు చేసుకొన్న పాతకథ. ప్రజల అభిమానం పొందిన కథ. ఏనాటికైనా ప్రజలు ఆదరించగల కథ.

### స... ని... మా:

**చలన చిత్రాల (మరికొన్ని) ఉపయోగాలు**

(1) నాటకముల కొరత తీర్చుట.

(2) నాటక బృందాలు, ఊరూరా తిరిగి నాటక ప్రదర్శనలిచ్చుట వ్యయప్రయాసలతో కూడినవని గాన, ఒకేసారి వాటిని చలనచిత్రాలుగా తయారుచేసి రవాణా ఖర్చులను, ప్రయాసను తగ్గించుట.



నందీవారి "సౌభాగ్యవతి"లో సావిత్రి.

కమ్యూనిటీ ప్రాజెక్టులు ప్రాతిపదికగా బి ఆర్. (విక్ హీరాలాస్త్రా) చోప్రా నిర్మిస్తున్న "నయాదౌర్"లో ఒకదృశ్యం భోపాల్ గగ్గర ఒకపల్లెలో చిత్రించిన ఈ సన్నివేశంలో వైజయంతిమాల, దిలీప్ కుమార్, చాంద్ ఉస్మానీ

## నిన్న విన్న కథలే అయినా...

అయితే ఇలా పురాణాలలో కథలు, ఇతర పూర్వగాథలూ, ఇవాళ పనికిరావనీ వాటి జోలికి పోరాదని ఎవరూ అనలేరు కలియుగం క్రీస్తుశకం ఇరువదవ శతాబ్దం ఉత్తరార్థంలో ప్రవేశించామన్న సంగతి గుర్తుంచుకొని, నిన్న విన్న కథలను ఇవాళ మళ్ళీ వినిపిస్తున్నప్పుడు, అవి కొత్తవనిపించే లాగ, సరికొత్త పద్ధతిలో చెప్పడానికి ప్రయత్నిస్తే బాగుంటుంది ★



 అదీ-ఇదీ 

సభలో ఉన్న వాళ్ళంతా చప్పట్లు కొట్టాలంటే, వక్త ఎవడో ఒకడిమీద (వీలైనంతవరకూ గట్టిగా జవాబివ్వని వాణ్ణి చూసుకుని) ఒక రాయి విసరడం మామూలు ఇది సులభమార్గాలలో ఒకటి

డాక్టర్ సి పి రామస్వామి అయ్యర్ వంటి బహుముఖప్రజ్ఞావంతులు ఈ రకం మార్గాల జోలికి పోకపోయినా, సభికులు వారి వచనాలను ప్రవచనాలుగానే స్వీకరించి గౌరవిస్తారు

అయినా డా॥ రామస్వామి అయ్యర్ మొన్న టాకీ రజతోత్సవ సందర్భాన జరిగిన నటీనట సన్మానసభలో మాట్లాడుతూ, డాక్యుమెంటరీ చిత్రాల నిర్మాణం, "వాస్తవమైన కళాకారుల"కే ఒప్పగించాలన్నారు

ప్రస్తుతం, ఈ డాక్యుమెంటరీ చిత్ర నిర్మాణకళ ప్రభుత్వోద్యోగుల చేతిలోపడి, ఎర్రటేపు బంధాలమధ్య ఇరుక్కుని అష్టకష్టాలూ పడుతున్నదని ఈ మాట ధ్వని

నిజానికి ఈ డాక్యుమెంటరీలకోసం చలనచిత్ర కళాకారులు ఆశతో, పట్టరాని అభిమానంతో అర్రులు చాచటంలేదన్న సంగతి సర్వజన విదితమే

అందుకని ప్రభుత్వమే వార్తాచిత్రాలతో పాటు వీటినికూడా నిర్మింపచేసి ప్రదర్శించకోరినా చలనచిత్ర పారిశ్రామికులు ససేమిరా

వద్దు పొమ్మంటున్నారు. ప్రభుత్వం కాబట్టి, పట్టువిడవకుండా కృషిసాగించింది కొద్దికాలంలోనే, ప్రభుత్వ ఫిలింస్ డివిజన్ ఈ రంగంలో సాధించిన ఫలితాలు అత్యంత ప్రశంసనీయమైనవి. ప్రయోజనకరమైనవి గర్వకారణమైనవి. ఇతర దేశాల చిత్రాల స్థాయికి ఇవేమీ తీసిపోనివి. అక్కడ ప్రశంసలందుకొన్నవి

తయారైన చిత్రాలను దృష్టిలో ఉంచుకుని ఆలోచిస్తే, "ఈ డాక్యుమెంటరీల నిర్మాణానికి, ప్రభుత్వోద్యోగులు కాక, "నిజమైన కళాకారులు" పూనుకొంటె బాగుండును అన్న మాట, బేసబబుగా కనిపిస్తుంది ఇంతవరకూ ఈ చిత్రాలు నిర్మించినవారు కళాకారులు కారని ధ్వనించడం న్యాయం కాదు

లేదా ఒక వ్యక్తి ప్రభుత్వందగ్గర జీతం పుచ్చుకున్నప్పుడు "రెడ్ టేప్" బానిస అనీ (ఉదాహరణ 'గౌతమబుద్ధ' నిర్మించిన బిమల్ రాయ్ ?) బాక్సాఫీస్ సూత్రాలకు లోబడి పనిచేస్తే కళాకారుడనీ అర్థం చెప్పుకోవలసి ఉంటుంది.

అచ్చ తెలుగులో చెప్పాలంటే రాజుగారి భార్యలిద్దరూ పతివ్రతలేగాని చిన్నావిడ కాస్త "ఎక్కువ పతివ్రత" అన్నట్టుంది

## చౌ చౌ ప్రదర్శనం

రిపబ్లిక్ దినోత్సవ సందర్భంలో దక్షిణ భారతఫిలిం జర్నలిస్టు సంఘంవారు "కళా మండపం" (తిరువల్లిక్కేణి)లో వినోద ప్రదర్శనం ఏర్పాటుచేశారు తెలుగు, తమిళ చలనచిత్ర నటీనటులు పాల్గొన్న ఈ ప్రదర్శ



వాహినిపేరిట పొన్నలూరి బ్రదర్స నిర్మిస్తున్న "భాగ్యరేఖ" చిత్రానికి ఈమధ్య మహాబలిపురంలో కొన్ని దృశ్యాలను షూట్ చేశారు. జమున వాటిలో పాల్గొన్నది. పై చిత్రంలో జమున, దర్శకుడు శ్రీ బి. ఎన్. రెడ్డి, ఛాయాగ్రహణ దర్శకుడు శ్రీ. బి. ఎన్. కొండారెడ్డిగార లను చూడవచ్చు.



# వరలక్ష్మీ ఫిలింస్‌వారి "సతీసావిత్రి"



మిటిమీారె నాతి

వరలక్ష్మీ ఫిలింస్ వారి తొలిచిత్రం "సతీ సావిత్రి" ప్రత్యేక ప్రదర్శనం మదరాసు పారగన్ టాకీస్‌లో జనవరి 24 న జరిగింది



మృదుగీతి రీతి

ఎస్. వరలక్ష్మి, నాగేశ్వరరావు, ఎస్. వి. రంగారావు ముఖ్యభూమికలు నిర్వహించారు.

ఇతర నటులు నాగయ్య, సూరిబాబు, దొరస్వామి, రేలంగి, డా॥ శివరామకృష్ణయ్య, ఋష్యేంద్రమణి, సూర్యకాంతం, సీత

ఈ చిత్రానికి శ్రీ కడారు (శ్రీ కృష్ణ తులాభారం) నాగభూషణం దర్శకుడు. పాటలు పోతవి, మాటలు శ్రీ రావూరువి

అశ్వపతి అనే రాజుకు లేకలేక ఒక పుత్రి ఆమె పేరు సావిత్రి ఆమె కొంత కాలంపాటు ("సతీ అనసూయ" కథ విని సినిమా చూసి) తాపీగా పిల్లలందరి మల్లేనే పెరిగి పెళ్ళీడు కొస్తుంది అప్పుడు నారదుడు సావిత్రిని, అడవిలో ఉన్న సత్యవంతుడినీ, ఆ పైన యమధర్మరాజునీ విడివిడిగా కలుసుకుంటాడు. మరి కొంతకాలం తాపీగా సాగాక సావిత్రీ సత్యవంతుడూ అడవిలో కలుసుకుంటారు సత్యవంతుడు అమ్మవారిబొమ్మవెనక దాగి "అసత్యవాణి"తో సత్యమైన ప్రేమను ప్రకటిస్తాడు. మరికొంత కాలానికి వాళ్లిద్దరు ఆ అడవిలోనే కలుసుకుంటారు అప్పుడు పెళ్ళి జరుగుతుంది ఇంకా కొంతకాలానికి, కాలాతీతం కావడంతో "అంతక భూపాలుడు" (రంగారావు) వాళ్ళిద్దర్నీ ఆ అడవిలోనే కలుసుకుంటాడు.

తరువాయి కథ తెరమీద చూడండి మీరిదివరకు కొండొకచో చూచిన వరుసప్రకారమే వెండితెరమీద కథ కూడా నాటీగా, తాపీగా సాగుతుంది పైలవరపు కంపెనీ వారు వినిపించిన పాటలూ, పద్యాలూ ఒకటి తరవాత మరొకటి వరుసప్రకారం వినిపిస్తాయి

రంగారావు నటన, మాధవపెద్ది సత్యం పాటలూ యముడి భూమికను బాగా ఒప్పించాయి ఈ కథలో రేలంగి, సీతల "ఆక్సెం" అలా ఉండగా, సూర్యకాంతం ధాటి మితి దాటి చెలరేగిపోయింది గడుసరిగా, గయ్యాళిగా, తగవులమారిగా అనేకమార్లు పెద్దసరి తెలుగు పడతులను విమర్శచేయగలిగిన సూర్యకాంతం ఇందులో మరీ తెలుగుమీరిపోయింది. ఎంత మహామ్మారి అయినా, ఏ భారత నారీ అన సాహించని మాటలతో ("ఇగో నా పుస్తె తెంపి మరీపో") ధోరణితో ఈవిధంగా హాస్యం సరఫరా చేయబోవడం శోచనియం.

ఈ చిత్రంలో ప్రత్యేకాకర్షణ సావిత్రిగా నటించిన ఎస్. వరలక్ష్మి గానం. ఆమె పాడిన పాటలూ, పద్యాలూ మధురమైన కంఠస్వరం తోడై, అతి శ్రావ్యంగా, వినడానికి హాయిగా ఉన్నాయి. ★



షెక్‌ముఖ్తార్ ప్రొడక్షన్స్‌వారి "దో ఉస్తాద్"లో మధుబాల.

సంభాషణలు హర్షవ్ లక్నోవి, పాటలు షకీల్ బదాయూనీ వ్రాశారు. నృత్యదర్శకులు సితారాదేవి, వినోద్ చోప్రా;

సంగీత దర్శకులు హుసన్‌లాల్ భగత్‌రాం.

ప్రధాన భూమికను నళినీ జయవంత్ మంచి సమర్థతతో, తగిన నిగ్రహంతో నిర్వహించింది. ఆమె చెల్లెలిగా నర్తకిగా ఉషా కిరణ్ చక్కగా నటించింది. నళినీ జయవంత్ ప్రియుడుగా అజిత్, ఈ సవ్రుత్ర ప్రభు



"ఆన్ బాన్" లో ఉషా కిరణ్.

# నర్తకి లలిత వివాహం

సినీనటి, ప్రసిద్ధ నర్తకి అయిన కుమారి (తిరువాన్కూర్ సోదరీత్రయంలో ప్రథమురాలు) లలితాంబికకు జనవరి 31 న వైభవంగా వివాహం జరిగింది.

వరుడు శ్రీ ఎస్ పి శివశంకరన్ నాయర్. ఈయన ఫ్రాన్సులో భారత రాయబారి సర్దార్ కె. ఎం. పణిక్కర్ మేనల్లుడు.

బుధవారం ఉదయం, అబాట్ బరీ (మౌంట్ రోడ్) భవనంలో వివాహానికి, సాయంకాలం విందుకు చలనచిత్ర పరిశ్రమ పెద్దలూ, నటీనటులూ పలువురు వచ్చి వధూవరులకు శుభాకాంక్షలు తెలిపి కానుకలు చదివించారు. రాత్రి శ్రీమతి ఎం. ఎల్. వసంతకుమారి బృందం గానసభ, తిరువాన్కూర్ ఆస్థాన విద్వాన్ శ్రీ పి ఎస్. వీరాస్వామి పిళ్ళె నాదస్వర కచేరీ జరిగాయి.

# హిందీ చిత్ర సమీక్షలు

## కాశ్యప్ చిత్రం "ఆన్‌బాన్"

డి. డి. కాశ్యప్ కొత్త చిత్రం "ఆన్‌బాన్"కు రసపుత్ర ప్రభువులు ఉజ్జ్వలంగా వెలిగిన కాలంనాటి స్థితిగతులూ, పరస్పర విశ్వాసాలూ, శత్రుత్వాలూ ఆధారం. రెండు రసపుత్ర కుటుంబాలమధ్య కలిగిన తగవు చల్లార్చి శత్రుత్వాలు నిర్మూలించటానికి, ఒక యువరాణి కృషి చేయటం ఇతివృత్తం. ఇది హిందీ చిత్రం, కొంత పాత తరహా కథే అయినా, దర్శకుడు కాశ్యప్, ఈ గాథను, ఆనాటి రసపుత్ర వైభవాన్ని చిత్రించటంలో ప్రశంసనీయమైన ప్రతిభను సాధించారు. ఈ చిత్రంలో నళినీజయవంత్, అజిత్, ఉషాకిరణ్, మహీపాల్, ప్రాణ్, ఉల్హాస్, [illegible] [illegible].



[illegible] మహీపాల్, నిరూపారాయ్.



## నాటికీ నేటికీ కూడా...





నటి మీనాకుమారి ఏ నాటికీ మరచిపోని మాట ఒకటి ఉంది

అది, ఆమె "బైజూ బావరా"లో నటిస్తున్న రోజులు (1951)

ఒక రోజున ఒక జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు మీనాకుమారి జాతకం చూశాడు.

"అమ్మాయీ జలగండం ఉంది. పడవ మీద షికారు వెళ్ళినపుడూ, ఈతలాడబోయినపుడూ జాగ్రత్తగా ఉండు అసలా జోలికి వెళ్ళకుండా ఉండడం మంచిదంటాను నన్నడిగితే" అన్నాడతను

మీనాకుమారి సరదాగా షికారుకేమీ వెళ్ళలేదు కాని, పనిమీద తప్పనిసరిగా, నదిమీద పడవ నడపవలసివచ్చింది ఆ రోజున "బైజూ బావరా" లో ఒక సన్నివేశానికి ఔట్‌డోర్ షూటింగ్.

నదిమీద పడవమీదఉన్న మీనాకుమారి, పరాకుమీద ఉండగా, ప్రవాహబలం పడవతో చెలిమి కలిపి జోరుగా తీసుకుపోతోంది మీనాకుమారి, అక్కడ ఉన్న చలనచిత్ర బృందం ఈ వైనం గమనించేసరికి, పరిస్థితి చేయిదాటిపోయే పరిస్థితి ఏర్పడింది ఎవరూ సాహసించి ముందుకురికి ఆమెను రక్షింప సాహసించ లేకపోయారు.

కథా నాయికి విలాసం, కథా కమామీషు వదిలేసి, ఆర్తనాదం చేయసాగింది ఆ నిస్సహాయ స్థితిలో దేవుడు స్వయంగా దిగి రాకపోయినా, నదివద్దకు "షూటింగ్" చూడవచ్చిన ఒక గ్రామస్థుడు, తటాలున నీటిలో ఉరికి, పడవనీ, పడతినీ కూడా, ఇవతలి గట్టుకి చేర్చాడు

నాటికీ నేటికీ కూడా ఆ నటి, ఆ నాటినీ, దైవజ్ఞుడి మాటనీ, మరువలేదు



పాటించటం, చురుకుదనం, ఛలోక్తులంతగా లేవు

కథా చిత్రణవిధానంలోగాని, దర్శకత్వంలోగాని నైపుణి, ప్రతిభ లేవు. ధోరణి చప్పగా ఉంది

నటీనటులలో బిపిన్‌గుప్త, అన్వర్ హుసేన్, జైరాజ్, ఆగా, ధుమాల్, ఉషాకిరణ్ ప్రతిభావంతంగా నటించారు మిగతా వారు, పేలవంగా, చైతన్య రహితంగా, కొందరు బొమ్మల్లాగ నటించారు. ముఖ్యంగా దుర్గాఖోటే నటనలో, ఆమె ఇటీవలి భూమికలలాగే కృత్రిమత్వం ఉట్టిపడుతోంది.

సంగీతం అంతంతమాత్రంగా ఉంది.

ప్రత్యేకా కర్షణ పేరిట, ఏర్పాటుచేసిన కిశోర్ కుమార్ నృత్యమూ (ఆడవేషమూ పెడివేషమూకూడా), పాటా కూడా, ఆకర్షణ మాట అటుండగా వికర్షణకు దారి తీసేవిగా ఉన్నాయి



(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)

ప్రక ఉల్హాస్ తమ భూమికలకు తీవి, హుందాతనం ఒప్పేలా తీర్చి దిద్ది, లోపరహితంగా నటించారు.



## పరివార్

దీనికి వారంరోజులక్రితం విడుదల అయిన చిత్రం బిమల్ రాయ్ దర్శకత్వాన రూపొందిన "పరివార్."

సమష్టి కుటుంబంలో ఐదుగురు అన్నదమ్ముల, వారి భార్యల తీరుతెన్నులను ఇందులో చిత్రించారు. కథ మంచిది బలంగలది. మంచిచెడ్డలు, చెప్పతగినంత చక్కగా, స్పష్టంగా తెలియచెప్పగలది.

చలన చిత్రంలో ఇదంతా ఉన్నా, బిగువు లవలేశం లేదు. నికార్సైన బెంగాలీ ఫక్కీలో సాదుగు అనిపించేటం నిడివిగా, విసుగుగా సాగింది.



శ్రీ ధనసాయి ఫిలిమ్స్‌వారి "బలేబావ"లో గుమ్మడి, రేలంగి.

# మంత్రాలు; నమ్మకాలు

(34-వ పేజీ తరువాయి)

ణము నాడయినా ఈ మంత్రం 200 పర్యాయములు జపంచేయాలి. జపానికి చిన్నరాళ్ళు నుపయోగించవచ్చు. గుఱుగాకు, గోగాకు, కుక్క నక్కలు ముట్టిన వస్తువులు, చచ్చింది, పుచ్చింది తినరాదు. బహిష్టు అయిన వారిచేతి యన్నము తినరాదు. వారితో మాట్లాడకూడదు. ఎవరి ఎంగిలి నీరు కూడా త్రాగరాదు. చావుకూడు, సమర్త కూడు, బంతి యన్నము పనికిరావు. ఇవి దీనికి గల నిబంధనలు.

ఇంకను కొన్ని మంత్రాలున్నాయి. అవి నానోటికి రావు. ప్రయోగించియు చూడలేదు. అందులో నొకటి 450 తూర్లు జపము. మంత్రం పెద్దది. చేసిన తరువాత విభూతి మంత్రించి నొసట యుంచుకొని పోవునపుడు దొంగలయినా, విరోధులయినావచ్చి యడ్డు పడినట్లయితే ముండ్లచెట్లు చూపి ఆకులు దూయమని చెప్పినట్లయితే తిరిగి పొమ్మనువఱకు రక్తము ధారలయి చిమ్ముతున్నను వదలరు. సుమారు 20 సంవత్సరాలకు ముందు మా తాతగారు అలా చేసినాడని చెప్పుతూ యుంటారు. కాని చూచిన విషయం కాదు. కొన్ని దినాలకు ముందు వంకాయల దొంగతనానికి వచ్చిన యొక దొంగ తోట ఆసామి పోయి పొమ్మనువఱకువంకాయను పట్టుకొనే యున్నట్లు చెప్పుతారు. ఈ భీతిచే మా గ్రామములో ఏదొంగతనాలు జరుగడము లేదు.

కొందరు కొన్ని సంవత్సరాలుగ తదేక నిష్ఠతో జపమాచరించి శక్తిని వశం చేసుకొంటూ యుంటారు. ఆశక్తి ఎప్పుడు పిలిసే అప్పుడు వచ్చి సాయం చేస్తుంది. అయితే సగం అన్నం మనము తింటే అది సగం తింటుందట. దీని నే 'యక్షిణి' యని కూడ అంటారు. ఏ విషయాలు కావలసినా అది చెప్పుతుంది. అలాంటి వారక్కడక్కడ కనిపిస్తున్నారు కూడా. మాయూరికి మొన్న మొన్న ఒక బిక్షుగాడు వచ్చాడు. వాడు మమ్మెఱుగడు. మేము వాణ్ణెఱుగము. కాని వాడు నా పేరు, మానాన్న పేరు, అందరి పేర్లు చెప్పినాడు. మా యింటి విషయాలన్ని కూడ చెప్పినాడు. నేను చాల ఆశ్చర్యపడ్డాను. మా మామగారు తరువాత చెప్పినారు వాడు ఆ యక్షిణి సాయమున చెప్పగలుగుతున్నాడని. ఇది చాలవఱకు నమ్మదగిన విషయము.

కె. చెంగల్రాయుడు,
—పదిపుట్లబయలు, చిత్తూరుజిల్లా.

★

# మద్రాసు విశ్వవిద్యాలయం

(5-వ పేజీ తరువాయి)

విశ్వవిద్యాలయం ప్రారంభించారు. 1929లో అన్నామలై విశ్వవిద్యాలయానికి శంకుస్థాపన జరిగింది. 1937 లో తిరువాంకూరు విశ్వవిద్యాలయం ప్రారంభించారు. 1953 లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రారంభమైంది. వీటికన్నిటికీ చాలావరకు మద్రాసు విశ్వవిద్యాలయమే మాతృక.

## కళాశాలలు

మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధించిన కళాశాలల సంఖ్య క్రమంగా బాగా పెరిగింది. ప్రస్తుతం ఈ విశ్వవిద్యాలయానికి అనుబంధించిన కళాశాలలసంఖ్య 73. వీటిలో 51 వేల 182 విద్యార్థులు చదువుకొంటున్నారు.

## స్త్రీ విద్య

ప్రస్తుతం విశ్వవిద్యాలయానికి అనుబంధించిన స్త్రీల కళాశాలల సంఖ్య 24. వీటిలో 9975 గురు విద్యార్థినులు చదువుకుంటున్నారు.

విద్యార్థుల వ్యాయామశిక్షణ, సైనికశిక్షణ మొదలైన విషయాలలో కూడా విశ్వవిద్యాలయం బాగా ముందంజవేసింది.

గత నూరుసంవత్సరాలలోను మద్రాసు విద్యాలయం వివిధరంగాలలో విశేషంగా అభివృద్ధిచెందింది.

దక్షిణ భారత విద్యాభివృద్ధికి మహత్తరమైన సేవచేసింది.

ముందుముందింకా మహత్తరమైన సేవ చెయ్యగలదని విద్యావేత్తలాశిస్తున్నారు.

★

# న్యూఢిల్లీ లేఖ

(10-వ పేజీ తరువాయి)

సరసుతే. అండోరాలో పన్నులు లేకపోవడంవల్ల ఏది కావలసినా చవకగా దొరుకుతుంది. 30 షిల్లింగులకు కాలిజోళ్ళు మంచివి వస్తాయి. రెండు పౌనులు పెడితే మొసలి చర్మపుజోళ్లు దొరుకుతాయి. ఫ్రెంచి బ్రాంది సీసా 8 షిల్లింగులు. ఫ్రెంచి అత్తర్లు అన్నీ ఫ్రాన్సులో కంటే చవక. స్విస్ గడియారాలు స్విట్జర్లెండులోకంటే చవక. జర్మన్ కెమెరాలు జర్మనీలోకంటే, ఇంగ్లీషు కార్లు ఇంగ్లండులోకంటే కారు చవక. ఇవన్నీ అండోరాలో కొనుక్కోడం బాగానే ఉంటుంది. కాని సరిహద్దులు దాటి వెళ్ళే సరికి వివిధదేశాల కస్టమ్సు అధికారులు దారుణమైన స్వాగతమిస్తారు. ఫ్రాన్సునుంచి స్పెయిన్ వెళ్లడానికి మూడు దోవలున్నాయి ఒకదోవ అండోరాగుండా పోతుంది.

1957 లో కూడా భారత దేశంలో యాత్రా పరిశ్రమ అభివృద్ధి అవుతుందేగాని పడిపోదు. ఎందుకంటే విదేశాలనుంచి వచ్చే ప్రముఖులకు ద్రవ్య మారకం ఇబ్బందులుండవు. వాళ్ల దేశాల్లో ప్రైవేటు సంస్థలు కొన్ని విదేశీ ప్రయాణాలకు ధనసహాయంకూడా చేస్తాయి. ఇక్కడ హాయిగా గడపవచ్చునని హామీ ఇస్తే ఎందరు యాత్రికులైనా భారతదేశం వస్తారు. ఇటీవల విదేశీయుల యాత్రలను ప్రోత్సహించడానికి మనం చేస్తున్న ప్రచారం అసలు సమస్యను మరుగుపరుస్తున్నది. "మాదేశంలో మీరు సంతృప్తి పొందినట్లయితే ఇతరుల కా విషయం తెలియజెయ్యండి. అసంతృప్తి పొందితే మాకు తెలియజెయ్యండి" అని మనం ప్రకటించాలి.

★



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.



వరి మోపుల వనితలు

—చిత్రకారుడు : శీలం యతిరాజు.



WILL NOT UPSET THE STOMACH
DOES NOT HARM THE HEART
ANACIN
TRADE MARK REGISTERED
TABLETS
GEOFFREY MANNERS & COMPANY PRIVATE LIMITED
MAGNET HOUSE, DOUGALL ROAD, BOMBAY
WHITEHALL PHARMACAL COMPANY, NEW YORK, U.S.A.


V 101.